# స్వార్థత్యాగము.

రావు వేంకట మహీపతి గంగాధర రామారావు.

# ఒ క మా ట

"కావ్యేషునాటకరమ్యం" యనెడి యార్యోక్తి సాధువు. ప్రపంచనాటకము దివ్యముగ జరుగుచున్నది. నటకులు ప్రవేశించుచున్నారు, ఆడుచున్నారు, పాడుచున్నారు, విలపించుచున్నారు, నిష్క్రమించు చున్నారు. తెర లెత్తఁబడుచున్నవి. దింపఁబడుచున్నవి. విశ్రాంతి లేదు, విరామము లేదు. జగన్నాటకసూత్రధారుఁడు సర్వమును జరపుచున్నాఁడు. ప్రేక్షకుఁడై యాలోకించు చున్నాఁడు

అట్టి నాటకములో నొక పాత్రధారియైన గ్రంథకర్త యొక యంతర్నాటకమును వ్రాసినాఁడు. స్వాభావికముగ వ్రాసినాఁడు, హృదయము విజృంభింప వ్రాసినాఁడు. ఛీఱు నవ్వు నవ్వినాఁడు. కన్నీరు గార్చినాఁడు.

నాటకరచనానంతరమున నీక్రిందివిధముగ భవభూతి కంఠమునఁ బాడినాఁడు.

యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే హి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.

గ్రంథకర్త.

# పాత్రలు

స్త్రీలు

1 విద్యుల్లత
2 తుషారకణ

పురుషులు

1 శశాంకుఁడు
2 చారుదత్తుఁడు
3 వినయభూషణుఁడు
4 సేవకుఁడు

# స్వార్థత్యాగము

## ప్రథమాంకము.

---

(ఒకపట్టణమున నొకసంపన్నుని గృహములో నొకగది. గోడకు మధ్యగ పెద్దకిటికీ యుండును. కిటికీపై గడియారముండును. దగ్గఱ నొక బల్లయు దానిమీఁద నొకపుష్పములపాత్రము నుండును. ఎడమవైపు గదిలోఁ గొంచెము వంకరగా సోఫాయు దానిదగ్గఱ నొక చిన్న చాఁపయు నుండును. కుడివైపున మూల నొక పెద్దకుర్చీ యుండును. ఆభాగముననే ప్రేక్షకులవైపున రెండు కుర్చీలుండును. ఒక చిన్నబల్లకూడ నుండును. దానిమీఁద సిగరెట్టు నుసి దులిపెడి గిన్నె యుండును. సోఫాకు దగ్గఱ పుస్తకముల బీరువా యుండును. కిటికీ కొకవైపున రవీంద్రుని ఛాయాపటమును మఱియొకవైపున గాంధిమహాత్ముని ఛాయాపటము నుండును. సోఫాదగ్గఱ నొకబల్లపై ఎలక్ట్రిక్ ఫ్యాను నుండును. మధ్యభాగమున నొక దీపము వ్రేలాడుచుండును. సోఫాప వెనుక నొక బల్లయుఁ గుర్చీయు నుండును. బల్లమీఁద టెలిఫోను నుండును. అది వ్రాఁతబల్ల)

### విద్యుల్లత

(సోఫాపైఁ గూర్చుండి చేతిలో భగవద్గీత పట్టుకొని ప్రవేశించును. ఆమె సన్నముగ నుండును. పొడుగుది కాదు. పొట్టియు నుగాదు. అందమైనది. మంచిరంగు ఖద్దరుకోక కట్టుకొని యుండును. అదే రకము రైక పొట్టిచేతులది. కాళ్లదగ్గఱ చిఱుచెప్పు లుండును. వయస్సు సుమారు ఇరువది సంవత్సరములు.)

శశాంకుఁడు.

(తలుపు దీసి లోపలకుఁ జూచును. అతఁడును సుందరుఁడే. చామనచాయవాఁడు, ఆంగ్లవస్త్రములు ధరించి యుండును. వయస్సు ఇరువదిమూఁడు సంవత్సరములు.)

విద్యుల్లత.

(తల త్రిప్పి శశాంకుని జూచి చిఱునవ్వు నవ్వి)
లోపలికి రండి.

శశాంకుఁడు.

(ప్రవేశించి) మీ సెలవులేకుండా రాకూడదూ ?

విద్యుల్లత.

ఉఁహూ !

శశాంకుఁడు.

ఎందుచేతనో అడగవచ్చునా

విద్యుల్లత.

ఆడవాళ్ల గదిలోనికి సెలవులేకుండా రావచ్చామరి? కూర్చోండి. (తన ప్రక్కను సోఫాపై కూర్చుండుఁడని సంజ్ఞచేయును )

శశాంకుఁడు.

(కూర్చుండి) ఆడవాళ్లగదైతేకాదూ ? (అని మందహాసము చేయును.)

విద్యుల్లత.

మరి ఇది యెవరి దండీ?

శశాంకుఁడు.

స్త్రీరూపము దాల్చిన బ్రహ్మరాక్షసిది.

విద్యుల్లత.

మీకంటికి నేను బ్రహ్మరాక్షసిలాగ కనిపిస్తున్నా కాదూ?

శశాంకుఁడు.

వచ్చిన చిక్కే అది. రాక్షసిలాగ కనిపిస్తే రానేరాను దగ్గరికి. పైకి జగన్మోహనాకారము. లోపల యక్షిణినికూడ మాయచేయ గలిగినంత మాయ. మీరొక్కరే కాదు. మీవంటివారు ఇంకా చాలామంది ఉన్నారు, స్త్రీ మహిమలంటే ఇదే.

విద్యుల్లత.

ఏమండీ, మీకు స్త్రీలోకంమీద మంచి అభిప్రాయం ఉందే!

శశాంకుఁడు.

ఉండబట్టే యింత చిక్కు.

విద్యుల్లత.

ఏం చిక్కు?

శశాంకుఁడు.

ఏం చిక్కా? వినండి చెప్తాను. బ్రహ్మదేవుడు స్త్రీలు అనీ పురుషులు అనీ రెండు తలతిక్క జాతులను పుట్టించాడు. పుట్టించి ఊరుకొన్నాడా? లేదు. పైపెచ్చు "పురుషుడు స్త్రీకి లొంగవలయును." అని పురుషునిఫాలభాగమున వ్రాశాడు. ఆబ్రహ్మవ్రాసిన తప్పుడువ్రాతచే మగవానికి స్త్రీపై మంచి అభిప్రాయం. ఈయభిప్రాయాన్నే కవులు ప్రేమ అనీ అనురాగమనీ ఏవో వారికి ఇష్టం వచ్చినట్లు పేర్లు పెట్టేరు. ఈఅభిప్రాయాన్నే ఆధారంగా పెట్టుకొని స్త్రీలు మగవాళ్లను ఇష్టం వచ్చినట్లాడిస్తున్నారు.

విద్యుల్లత.

మీ ఉపన్యాసము పేపర్లో ప్రకటించకూడదూ?

శశాంకుఁడు.

ప్రకటించడమే! ఇంకేమైనా ఉందా? ఆడవాళ్లందరూ నామీద దొక్కసారిగ పడిపోరూ? పడిపోయి నన్ను ముక్క ముక్కలుగ చేసి నలిపి, నూరి, నీళ్లలో కలిపి దాహం పుచ్చుకోరూ? అమ్మో! ఎంతమాట!

విద్యుల్లత.

(నవ్వి) ఆడవాళ్లకు భయపడే మీ ధైర్యం చాలా పొగడ దగినది సుమండీ!

శశాంకుడు.

ఆడదానికి భయపడని మగవాడిని చూపించండి. పంచపాండవులు పాంచాలికి భయపడలేదా? దూర్వాసుని వంటి మహాకోపి భార్యఅంటే గడగడ వణక లేదా? శ్రీకృష్ణ మూర్తి అంతవానికే సత్యభామ అంటే వెనకబెదురే. ఇప్పుడు స్త్రీస్వాతంత్ర్యముకొరకు సభలలో తెయితక్కలాడే మర బొమ్మలకు మర తిప్పే శక్తి ఇంటివగ్గర వుంటుంది. ఆలాగే కాకపోతే ఏపురుషుడు కర్మము చాలక తనకు వచ్చినస్వా తంత్ర్యమును పోగొట్టుకొనడానికి ఇష్టపడతాడు? స్త్రీకి స్వా తంత్ర్యం ఇవ్వాలంటే పురుషుడు తన స్వాతంత్ర్యమును తగ్గించా లన్నమాటే. పురుషుని సంపూర్ణస్వాతంత్ర్యేఘు స్త్రీస్వాతంత్ర్యమునకు ఎట్లు భంగకారియో అట్లే స్త్రీల సం పూర్ణస్వాతంత్ర్యము పురుషుని దాస్యసౌభాగ్యమునకు మూ లకారణం. కాబట్టి యింట్లో పోరు లేకున్నను సభలలో పోరు పెట్టేవాళ్లు నూటికి ఒకడో యిద్దరో. మిగిలినవారికి "అంత స్వార్థత్యాగమేదీ? ఒకవేళ ఉన్నా, వారి ఆటలు ఇంటి"దగ్గర సాగవు. భర్తకు ఎంత విశాలాభిప్రాయాలు ఉన్నా భార్యకి ఇష్టం లేకపోతే ఆటకట్టే. ఆడవాళ్ల పట్టు మాన్పడానికి బ్రహ్మ కైనా తరం కాదు, అందుచేతనే స్త్రీకి భయపడతాడు" పురు షుడు అన్నాను.

స్వార్థత్యాగము

విద్యుల్లత.

స్త్రీ అబలకదా పురుషుడు బలవంతుడుగదా? ఎందుచే స్త్రీకి పురుషుడు లొంగి పోతాడూ? పైమాటలే కాని మగవాడు ఆడదానికి భయపడడమేమిటి? భార్యను కొట్టే భర్తలు లేరూ?

శశాంకుడు.

ఉన్నారు—లేరనను. నేను సాధారణంగా ప్రపంచంలో జరిగే రీతి చెప్పేను, కాని అసాధారణపు విషయాలను గురించి చెప్పనేలేదే. అలా చూస్తే మరి భర్తలను బావ మోదే అబలా శిరోమణులు లేరూ? ఉన్నారు!

విద్యుల్లత.

కాని, స్త్రీ అసలు అబలకాదూ?

శశాంకుడు.

స్త్రీ అబలా? పురుషుడు బలవంతుడా? స్త్రీ అబల అని పేరు పెట్టిన నిర్భాగ్యపు దామోదర చక్రవర్తిని ఈ లెంపా ఆలెంపా వాయించవలయును. కాని, స్త్రీ అబలమాత్రము కాదు, ముమ్మాటికీ కాదు!

విద్యుల్లత.

ఏం?

## ప్రథమాంకము

### శశాంకుఁడు.

ఏఁవా? వినండి. బలాబలాలు ఎలా తెలుస్తాయీ? యుద్ధంలో ఎవరు గెలిస్తే వారు బలవంతు లన్నమాట. చూడండి. సంసారయుద్ధంలో స్త్రీ గెలుస్తుందో పురుషుడు గెలుస్తాడో. స్త్రీపురుష యుద్ధనాటకంలో వివాహం ప్రథమాంకం. వివాహానికి ముఖ్యకారణం వధూవరుల ప్రేమకదా! ఇప్పుడు స్త్రీ, పురుషుని ఒకనిని తన తీక్ష్ణమైన చూపులకు గురిచేసి వానిని యెట్లో తన వలలో పడవేసికొని లాగి బిగించి గట్టిగా కట్టివేయును. పురుషుని కిష్టమున్నను లేకపోయినను స్త్రీ కోరినయెడల వానిని తన పాదాక్రాంతునిగ చేసికొనగలదు. వాని కింక ముక్తిలేదు. సుడిగుండములోపడ్డ ఆకువలె గిరగిర తిరిగి పాతాళలోకమునకు పోవును. దీనికి కారణం మగవాని అశక్తత. ఇంక—ద్వితీయాంకములో—సంసారంలో అనేక చిక్కులు వస్తాయి. భార్యకి ఒకటి ఇష్టం. భర్తకి మరియొకటి ఇష్టం. ఇద్దరూ వాదిస్తారు. వాదనలో గెలిస్తే భార్య యిష్టం ఏలాగైనా జరుగుతుంది. ఒకవేళ వోడిపోతే ఏవో వగలుపడుతుంది. అదీ లాభించకపోతే స్త్రీ లోకాని కంతకూఉన్న బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తుంది. ఏఁవిటది? ఏడుపు. దానితో పురుషుడు హడిలిపోయి లొంగి

పోతాడు. అప్పుడు స్త్రీ, జయభేరీ మోగిస్తుంది. అందుచేత స్త్రీ అబలకాదు. పురుషుడే అబలుడు.

విద్యుల్లత.

సరే. దాని కేమి కాని—అసలు ప్రపంచం అంతా ఏ లేది పురుషు దేకాదూ?

శశాంకుఁడు.

అబ్బే, అది వట్టిభ్రమ. ప్రపంచమునకు ఆదికారణం స్త్రీ. శక్తిస్వరూపిణి ఆమె! పురుషుడు నిమిత్తమాత్రుడు. విగ్రహపుష్టి నైవేద్యనష్టిని.

విద్యుల్లత.

పురుషునికి ఆనిమిత్తమాత్రత్వం మట్టుకు ఎందుకు? (నవ్వేను.)

శశాంకుఁడు.

వద్దు—అదికూడ ఇవ్వవద్దు. ఇప్పటికే గాజులు తొడిగించారు. ఇంక బోడిముండను చేసి ఒకమూల కూర్చుండబెట్టితే అప్పుడు స్త్రీ స్వాతంత్ర్యమునకు శోభ వస్తుంది.

(ఇంతలో సుపారకణ ప్రవేశించును. ఆమె అందమైనది. సన్నని శరీరము. కొంచెము పొడుగు. మంచిరంగే. జపాను పట్టు చీరె కట్టును. పచ్చరంగుది. అదే రకము రైక. చేతులు మాత్రము మాయ మయ్యెను-రైకను. కాళ్లను పాశ్చాత్యదేశపు జోడును

పట్టుమేజోడును ధరించును. పెదవులకు ఎఱుపురంగు వేయును. కనుబొమ్మలకు నలుపురంగు బుగ్గలకుఁ గొంచెము ఎఱుపు రంగు. నవనాగరికా శిరోమణి.)

తుషారకణ.

సెలవురేకుండా గదిలోనికి వచ్చినందులకు క్షమింప వలయును.

విద్యుల్లత.

అబ్బే. ఫరవాలేదు.

శశాంకుఁడు.

(లేచి) ఆడవారికి సెలవెందులకు. ఏదైనా మాకే కాదూ! అవునుకాని మీరు యూరపునుండి వచ్చిన తర్వాత ఒక్కసారి మాత్రమే దర్శన మిచ్చారు. మళ్లీ నేటికి!

తుషారకణ.

మాపై మీకు దయ ఉంటేకాదూ? (అని తీక్ష్ణమైన చూపును విద్యుల్లతపై విసరును.)

శశాంకుఁడు.

ఎంతమాట! మీవంటివారికి మాపై దయఉండాలి కాని మాలాంటివారిమీద ఉంటే ఎంత లేకపోతే ఎంత!

విద్యుల్లత.

తుషార్! కూర్చో.

తుషారకణ.

(కుర్చీపైఁ గూర్చుండి చేతిలో సిగరెట్టు పెట్టినుండి యొకటితీసి అంటించి కొంచెము కాల్చి నుసిని గిన్నెలో దులుపుచు)
విద్యుల్లతా! ఈనాటిరాత్రి నృత్యం ఉంది. చారుదత్తుడు వస్తూ ఉన్నాడు. నీవు తప్పక రావాలి.

విద్యుల్లత.

నేనా? (అని సందేహించును.)

తుషారకణ.

అవును. తప్పదు. శశాంక్! నీవుకూడా రావాలి.

శశాంకుఁడు.

సరే. (తుషారకణ కుర్చీదగ్గఱ నున్న కుర్చీపైఁ గూర్చుండి విద్యుల్లతతో) మీరు వస్తారా?

విద్యుల్లత.

ఆ.

తుషారకణ.

(శశాంకునివైపు భావగర్భితమైన యొకచూపు చూచును.)

శశాంకుఁడు.

(ఆచూపునకు, దాళఁజాలక కొంచెము కలఁతనొంది యర్థములేని చిఱునవ్వు నవ్వును)

విద్యుల్లత.

(భగవద్గీతలోని పత్రములను దిరుగ వేయుచుండును.)

శశాంకుఁడు.

(ఏమి చేయుటకు దోఁచక) తుషార్! మీరు—ఊఁ—టెన్నీసు బాగా ఆడతారట?

తుషారకణ.

నాకంటె విద్యుల్లతే బాగా ఆడుతుంది.

విద్యుల్లత.

ఏదో! ఒక మోస్తరు.

శశాంకుఁడు.

మీరు చాలా బాగా ఆడతారు. నేను చూశానుకాదూ?

విద్యుల్లత.

మగవాళ్ల మెప్పుకేం లెండి.

శశాంకుఁడు.

(వెలవెలఁబోవును.)

తుషారకణ.

(చిఱునవ్వు నవ్వును.)

విద్యుల్లత.

(ప్రస్తావన మార్చి) తుషార్! నీవు మాత్రం విదేశవస్త్ర బహిష్కారం చేయడం లేదు. విదేశవస్త్రాలు కొనడంచేత మనదేశానికి ఎంత నష్టం కలుగుతూందో తెలుసుకొంటే నీవు వాటిని కొనవు.

తుషారకణ.

నీ వన్నమాట నిజమే. ఉన్నవాటిని యేం చేయను? ఇక ముందుమాత్రం కొనదలచుకోలేదు.

శశాంకుడు.

విదేశవస్త్రాలంటే జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు కొందరు బుద్ధిమంతులు ఇంక స్వరాజ్య వస్తే విదేశవస్త్రాలు దొరకవని ఇప్పుడే విదేశవస్త్రాలతో జన్మజన్మాంతరములవఱకూ సరిపోయే టట్లు తమ పెట్టెలను నింపుతున్నారట! ఆహా! వారి దేశభక్తి! ఏమి స్వార్థత్యాగం?

విద్యుల్లత.

పాపం, ఎంత అవివేకమో!

శశాంకుడు.

వారు మీ ఆడవారే!

విద్యుల్లత.

ఎవ రైతే యేం!

శశాంకుడు.

అలాకాదు. మగవాడే అలాంటి పనిచేస్తే వానిని ఈపాటికి చీపురుగట్టతో పురుగును తుడిచినట్లు తుడిచి ఏ హిందూమహాసముద్రములోనో ఏబంగాళాఖాతములోనో పారవేయుదురు.

తుషారకణ

ఎవరండి ఆలా పారవేసేది?

శశాంకుఁడు.

ఇం కెవరు? స్త్రీలే. జనమేజయుఁడు సర్పయాగము చేసినట్లు స్త్రీ. పురుషయాగము చేస్తూన్నదికాదూ?

తుషారకణ.

ఇన్నాళ్లనుండి మామీద సవారీచేస్తూన్నందుకు తగిన శాస్తి అయింది.

శశాంకుఁడు.

ఆమాట ఒప్పుకోక తప్పదు. కాని అసలు మీమీద అధికారం మాకు మొదట లేదు. మధ్య వచ్చింది—ఒక విధంగా కొన్నిసందర్భాలలోమాత్రం. ఇప్పుడు అది అంతా తుడిచిపెట్టుకుపోయింది, చాలాపరకు.

విద్యుల్లత

అయితే స్త్రీకి స్వాతంత్ర్యం ఉండకూడ దనా మీ సిద్ధాంతం?

శశాంకుఁడు.

అబ్బే! అలాకాదు! మీమీద అధికారం చెలాయించ డం యెంత తప్పో మాకు, మామీద అధికారం చెలాయించ డం మీకూ అంత తప్పే. అదీ నా వుద్దేశం.

తుషారకణ.

మగవాణ్ణి కట్టులో ఉంచకపోతే లాభంలేదు. (చిన్న నవ్వునవ్వును.)

శశాంకుడు.

మీకు ఆ కట్టు అక్కరలేదు కాబోలును!

తుషారకణ.

(నవ్వును.)

విద్యుల్లత.

(గడియారము వైపు చూచి) అయిదైంది. నేను ఒక ఉత్తరం వ్రాసి వస్తాను. క్షమించండి. (అని సోఫాపైనుండి లేచి వ్రాతబల్లయొద్దకు వెడలి యుత్తరము వ్రాయుచుండును.)

తుషారకణ.

మీ వాచీలో ఎంతైందండి? (అని శశాంకుని హస్తము పట్టుకొని టైము చూచుచు చేయి కొంచెము నొక్కును.)

శశాంకుడు.

(ఒకింతుక కంపించి) అయిదు.

తుషారకణ.

అయితే మీ టైముకీ విద్యుల్లత టైముకీ భేదం లేదే. (అని చిఱునవ్వు నవ్వును.)

శశాంకుడు.

ఇంతవరకు లేదు.

తుషారకణ.

ఇక ముందు భేదం ఉంటుందా ?

శశాంకుఁడు.

బహుశః ఉండదు.

తుషారకణ.

ఆఁహాఁ (అం తనచేయి శశాంకుని హస్తముపైఁ నుండి తీయును.)

శశాంకుఁడు.

(ఆలోచనా నిమగ్నుఁడగును.)

తుషారకణ.

(సిగరెట్టు కొంత కాల్చి గిన్నెలో పాఱవైచి) ఏమిటండీ ఆలోచిస్తున్నారు?

శశాంకుఁడు.

ఏమీ లేదు.

తుషారకణ.

చెప్పక తప్పదు. (అని లేచి శశాంకుని చేయి గట్టిగా పట్టుకొనును.)

శశాంకుఁడు.

చెప్పుతా కాని మీరు నన్ను ముట్టుకో వద్దు.

తుషారకణ.

(చేయి తీసికొని కూర్చుండి) ఏం?

శశాంకుఁడు.

మీరు నన్ను ముట్టుకొంటే అదో విధంగా వుంది. విద్యుచ్ఛక్తిగల తీగె తాకితే యేలా వుంటుందో ఆలావుంది.

తుషారకణ.

విద్యుచ్ఛక్తి గలది నేను కాదు! విద్యుల్లత. (నవ్వేను.)

శశాంకుఁడు.

మీ యిద్దరికినికూడ ఉండవచ్చును.

తుషారకణ.

సరే కాని, మీఆలోచనమాట చెప్పరూ?

శశాంకుఁడు.

నాఆలోచన చెప్పితే, మీ రేఁ వనుకొంటారో.

తుషారకణ.

ఫరవాలేదు. చెప్పండి.

శశాంకుఁడు.

అయితే వినండి నేను ఆలోచించువిషయం. రెండు సూదంటురాళ్లమధ్య ఒక యినపముక్క పడింది. ఈ యినప ముక్క యేవైపు పోతుందో తెలియదు. రెండుసూదంటు రాళ్లును తమ కున్న ఆకర్షణశక్తిని సంపూర్ణముగా ప్రయోగిస్తున్నాయి. దేని కెక్కువ బలం ఉంటే అది లాక్కుంటుంది.

తుషారకణ.

అయితే మధ్యనున్న యినపముక్క ఇష్టంతో అవసరం లేదూ

శశాంకుఁడు.

(చిఱునవ్వు నవ్వి) ఆలా కనిపించదు.

తుషారకణ.

మీ మాట కర్థ మవడంలేదు.

శశాంకుఁడు.

అర్థం అవకపోతే ఎలావేశారు ప్రశ్న

తుషారకణ.

అబ్బే; మీ రన్నమాటమీద మధ్యనున్నదాని యిష్టంతో ప్రయోజనం లేదా అన్నాను. అంతేకాని ఇంకేమీకాదు.

శశాంకుఁడు.

ఆలాగా? అవును పాపం మీకేం తెలుసును. పయోముఖవిష——

తుషారకణ.

ఆఁ, ఆఁ, ఇం కాపైమాట అనవద్దు.

(తలుపు తీసికొని వినయభూషణుఁడు ప్రవేశించును. సుమారు 80 సంవత్సరముల వయస్సు. కన్నులలో శాంతరసము కనుపట్టుచుండును. పంచె కట్టుకొని యుండును. అడేరకేము చొక్కా ధరించియుండును.)

శశాంకుఁడు.
తుషారకణ.
(వినయభూషణుని జూచి లేచి నమస్కరింతురు.)

వినయభూషణుఁడు.

(నమస్కరించి) కూర్చోండి, లేవవద్దు. విద్యుల్లత ఏదీ? (అని యిటు నటు చూచి) అమ్మా! ఏమిటి వ్రాస్తూ న్నావు?

విద్యుల్లత.

(లేచి) అబ్బే; ఏమీలేదు. నా కీఉంగరం పంపించి నందుకు అత్తకు వందనపూర్వకంగా ఉత్తరం వ్రాస్తూ న్నాను. (అని తన వ్రేలి యుంగరము చూపును.)

వినయభూషణుఁడు.

ఉత్తరం ముగించేయి (అని సోఫామీఁదఁ గూర్చుండును.)

విద్యుల్లత

(మరలఁ గూర్చుండి లేఖను దొందరగా ముగించుచుండును.)

వినయభూషణుఁడు.

తుషార్! ఇల్లా కూర్చో అమ్మా!

తుషారకణ.

(వచ్చి సోఫాపైఁ గూర్చుండును.)

శశాంకుఁడు.

(కుర్చీపైఁ గూర్చుండి) తమశరీరంలో ఆరోగ్యంగా ఉందా ?

వినయభూషణుఁడు.

ఏదో ఒకమోస్తరుగా ఉంది.

శశాంకుఁడు.

మీరు ఒకసారి మళ్లీ సముద్రప్రయాణం చేస్తే బా గుంటుందేమో.

వినయభూషణుఁడు.

వెళ్లాలి మళ్లీ ఇంకొకసారి యూరపుకి ఆరోగ్యం కొరకు. మనదేశాన్ని లేని ఆరోగ్యం కలుగచేసే ప్రదేశాలు అక్కడ ఉన్నాయని కాదు—సముద్రయానం మంచి చని. ఐనా విద్యుల్లతకు ఇంకా వివాహం కాలేదు. .....

తుషారకణ.

మీ కొక్కతే కొమార్తె కాదూ ? ఎందుకు తొందర నాయనా !

వినయభూషణుఁడు.

తొందర లేదమ్మా ! నేను పెద్దవాడ సయాను. ఎప్పు డీలోకం విడిచిపెట్టి పోవాలో తెలియదు. విద్యుల్లతకు తల్లి చిన్నప్పుడే పోయిందికదా ? నేను కూడ లేకపోతే అవివాహి

తమైన ఈకన్య ఈప్రపంచకంలో ఏలా ఈదు కొస్తుంది ? ఆప్టే లోకంలో అనుభవం కలదికాదు. చిన్నవయస్సు. ఈ లోకంలో అనేక ఆకర్షణాలు ఉంటాయి. సుఖానుభవానికి హద్దు ఉండాలి. లేకపోతే ఇహపరసౌఖ్యాలు ఉండవు. లోకానుభవం లేనివాళ్లు తప్పు మార్గాల్లో త్వరగా పడిపోతారు. వివాహం అయితే వారి భర్తలు సలహా ఇస్తూంటారు. అందుచేత విద్యుల్లతకు వివాహం అయితే నాకు ఇంక బరువు లేవీ ఉండవు.

శశాంకుఁడు.

(పటముల వంకఁ జూచుచుండును.)

తుషారకణ.

విద్యుల్లత కిష్టం కావద్దూ ?

వినయభూషణుఁడు.

అవునమ్మా ! ఆమె కిష్టంలేని పని నే చేస్తానా ?

విద్యుల్లత.

(ఉత్తరము ముగించి బయటికి వెళ్లి యుత్తర మిచ్చి సోఫాదగ్గఱకు వచ్చి తండ్రి వైపున సోఫాచేతిమీఁదఁ గూర్చుండి) నాన్నా ! ఈరాత్రి తుషారకణ నన్ను రమ్మని పిలుస్తూంది; నృత్యానికి వెళ్లుతుందట.

వినయభూషణుడు.

వెళ్లు: అమ్మా! కాని మీ రందరును చిన్నవాళ్లు. జాగ్రత్త

తుషారకణ.

(వినయభూషణుడు చూడకుండ శశాంకుని జూచి కన్ను గీటును )

విద్యుల్లత.

(దానిని జూచును.)

శశాంకుడు.

(ఏమియు గమనింపని వానివలె నుండి) మీరు యూరప్ వెళ్లునపుడు నన్ను కూడ తీసికొని వెళ్లరాదదూ ?

వినయభూషణుడు.

(నవ్వి) అభ్యంతర మేమి ? కాని, మీ మనస్సు కొంచెము అస్థిర మైనది. నిలకడ ఉన్నట్లు కనిపించదు. మీ కొక్కరికే కాదు. సాధారణంగా యౌవనవంతుల కందరికీ ఉండే విశేషమే ఇది. ఈవేళ వస్తామంటారు. రేపు రావడాని కేదో అడ్డు పెట్టుకుంటారు. అదియొక గాలిపాటు విశేషం.

శశాంకుడు.

(ఒకించుక వెలవెలఁబాతి చిఱునవ్వుచే దానిని గప్పిపుచ్చును.)

విద్యుల్లత.

(శశాంకుని వైపు చూచును.)

తుషారకణ.

(గర్వయుతమగు చిఱునవ్వు నవ్వి లేచి) నే నిక సెలవు తీసుకొంటా.-(అని వినయభూషణునికి నమస్కరించును.)

వినయభూషణుఁడు.

(నమస్కారమును స్వీకరించి) అప్పుడే వెళ్లవలెనా ? ఏమమ్మా ! ఫలహారం పుచ్చుకోవూ ?

తుషారకణ.

ఇప్పుడు ఆకలిగా లేదు, మళ్లీ రాత్రి వస్తానుకాదూ విద్యుల్లతకోసం ?

వినయభూషణుఁడు.

సరే.

తుషారకణ.

విద్యుల్లతా ! సెలవు.

విద్యుల్లత.

సెలవు.

తుషారకణ.

శశాంక్ ! నా కారు వెళ్లిపోయినది. నీవు నన్ను నీ కారులో తీసుకువెడతావా ?

శశాంకుఁడు.

(లేచి) తప్పకుండా!

విద్యుల్లత.

మీరూ ఏమీ పుచ్చుకోరూ?

శశాంకుఁడు.

నేను ఫలహారం చేసే వచ్చాను. ఇప్పటికి సెలవు తీసుకొంటా. ఇంకా ఉండాలని ఉందికాని వెళ్లక తప్పదు.

తుషారకణ.

మీ కిష్టం లేకపోతే రావద్దు. విద్యుల్లతా! మీకారు లేదూ?

శశాంకుఁడు.

అబ్బే, ఫరవాలేదు, వస్తా. సెలవు. (అని వినయభూషణునకు నమస్కరించును.)

వినయభూషణుఁడు.

(స్వీకరించును.)

శశాంకుఁడు.

(విద్యుల్లతను జూచి) వెడతా.

విద్యుల్లత.

ఊఁ.

(శశాంకుఁడును దుషారకణయు నిష్క్రమింతురు.)

విద్యుల్లత.

(సోఫా చేతిమీఁదనుండి లేచి తండ్రి కుడిప్రక్కను గూర్చుండును.)

వినయభూషణుఁడు.

ఈవేళరాత్రి నృత్యాని కెవరెవరు వస్తూన్నారమ్మా!

విద్యుల్లత.

తుషారకణ, శశాంకుడు, చారుదత్తుడున్నూ.

వినయభూషణుఁడు.

చారుదత్తుని ఎరుగునా. తుషారకణ?

విద్యుల్లత.

ఎరుగును. బాగా ఎరుగును. వా రిద్దరు మాంటికార్లోలో కలుసుకొన్నారట.

వినయభూషణుఁడు.

మనం చారుదత్తుని ఎక్కడ చూచాం మొదట?

విద్యుల్లత.

పారిస్‌లో.

వినయభూషణుఁడు.

అతడు మంచివాడు లాగే ఉన్నాడు-ఏం?

విద్యుల్లత.

(మౌనమును వహించును.)

వినయభూషణుడు.

చారుదత్తుని తల్లి తన కొడుకునకు నిన్నిమ్మని వర్తమానం పంపుతూంది. చారుదత్తునికికూడా నీవంటే చాలా ఇష్ట మటమ్మా !

విద్యుల్లత.

(ప్రత్యుత్తర మీయదు.)

వినయభూషణుడు.

ఏం చెప్ప మంటా వమ్మా !

విద్యుల్లత.

మీ ఇష్టం.

వినయభూషణుడు.

అలా కాదమ్మా ! నీఇష్టం చెప్పు. అదే నాకూ ఇష్టం.

విద్యుల్లత.

(ఊరకుండును.)

వినయభూషణుడు.

చెప్పు, ఫరవాలేదు,

విద్యుల్లత.

(మెల్లఁగ) నాకిష్టం లేదు.

వినయభూషణుఁడు.

అయితే సరే నమ్మా! నీకిష్టం లేనివానికిచ్చి నే నెప్పుడూ వివాహం చెయ్యను.

విద్యుల్లత.

(తలవంచి కూర్చుండును.)

వినయభూషణుఁడు.

అమ్మా! భగవద్గీతలో రెండుశ్లోకాలు చదువు. ఇహము పరమూ కలుగుతుంది.

విద్యుల్లత.

(భగవద్గీతను దీసి)

“సంకల్ప ప్రభవాన్కామాం
స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసైవేంద్రియగ్రామం
వినియమ్య సమంతతః.

శనై శ్శనై రుపరమే
ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మ సంస్థం మనః కృత్వా
నకించి దపి చింతయేత్.

యతో యతో నిశ్చరతి
మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియ మ్యైత
దాత్మ న్యేవ వశం నయేత్.

ప్రశాన్త మనసం హ్యేనం
యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాన్తరజసం
బ్రహ్మభూత మకల్మషమ్.''

(తెరపడును.)

ప్రథమాంకము సమాప్తము.

---

# స్వార్థత్యాగము.

## ద్వితీయాంకము.

---

(ఉద్యానము, మంచివెన్నెల, 'సోఁఫ్రకరు' ధరించి శశాంకుఁడును, సన్నని ఖద్దరు రైక, స్వదేశీపట్టుమేజోడు, జోడు, ధరించి విద్యుల్లతయుఁ బ్రవేశింతురు.)

శశాంకుఁడు.

ఈరాత్రి నిజంగా విద్యుల్లత విద్యుల్లతే!

విద్యుల్లత

ఆహా! శశాంకుని కాంతి యెంత బాగుందో! మీ మాటకాదు! చంద్రునిగూర్చి (నవ్వును.)

శశాంకుఁడు.

నామాట అని నేనన్నానా? మీ కాకంగా రెందుకూ?

విద్యుల్లత.

(శశాంకుని ముఖము వైపు చూచును.)

శశాంకుఁడు.

మీ రల్లా చూస్తూంటే నేను చెప్పలేనంత కష్టంలేని

బాధపడుతున్నాను. మీ రాలా చూడవద్దు. మీచూపులో ఒక విధమైన శక్తి ఉంది. నేను నిజం చెపుతున్నాను, మీ రలా చూడడం న్యాయం కాదు.

విద్యుల్లత.

అబ్బే! నేనేం చేశాను? (అని చిఱునవ్వు నవ్వును.)

శశాంకుఁడు.

మీ రేమీ అనుకోకండి. నిజం చెప్పుతున్నా. మీ వంటివారితో ఒంటరిగా ఉండడమే చాలా ప్రమాదకరం అందులో రాత్రి! వెన్నెలరాత్రి!! స్థలం ఏలాంటిది! ఉద్యానవనం-చల్లనిగాలి-పువ్వులపరిమళం! ఇంక చెప్పాలా?

విద్యుల్లత.

మరేం భయం లేదు.

శశాంకుఁడు.

మీకు భయం ఉన్నా లేకున్నా నాకుంది. నేను మాటలతో చెప్పలేను నాభావం.

విద్యుల్లత.

(చేతిరుమాలు క్రిందికి విడుచును.)

శశాంకుఁడు.

(దానిని దీసి యిచ్చును.)

విద్యుల్లత.

(దాసిని వ్యాకరించుటలో ననవసరమగు కాలస్యము చేయును.)

శశాంకుఁడు.

(ఆమె హస్తమును గ్రహించి) ఎంత చల్లగా వుందీ గాలి! (అని యొకక్షణకాలము నిమీలితనేత్రుఁ డగును. కన్నులు తెఱచి, చేయి విడిచిపెట్టి) సెబాస్! మీరు నన్ను గెల్చారు. నేను ఆడదానికి లొంగకుండా ఉండా లనుకొన్నాను. వ్రతభంగం అయినది. ఋష్యశృంగు డంతవానికే తప్పనప్పుడు ఇక నామాట చెప్పేదేమిటి? మీరు పన్నినవలలో పడిపోయాను. ఇక నన్ను తప్పించుటకు బ్రహ్మకైనా తరంకాదు. హా! జితోస్మి! జితోస్మి!

విద్యుల్లత.

(నవ్వి) పాపం ఎంతకష్టం వచ్చిందో?

శశాంకుఁడు.

విజమే. అబద్ధం కాదు. స్త్రీకి లొంగిపోవుటవల్ల వచ్చేకష్టాలు ఇన్నీ అన్నీకావు. అందులో వివాహమంటే దాస్యం కాక యింకేమిటి! కొత్తలో సుఖం. క్రమంగా తెలుస్తుంది, సంసారం సుఖమో దుఃఖమో; కాబట్టి వివాహం చేసుకోవడం స్వాతంత్ర్యానికి స్వస్తి చెప్పడమే!

విద్యుల్లత.

అయితే మీరు....స్త్రీకి లొంగకుండా ఉండే టంత శక్తి లేదు మీకూ ?

శశాంకుఁడు.

ఇంకా అడుగుతున్నారా ? నాయొక్క స్వాతంత్ర్య సామ్రాజ్యంమీదకి దాడి వచ్చింది మీరే. నేను ఎదురు కున్నాను కాని లాభం లేకపోయింది. మహానదీప్రవాహాన్ని అడ్డుపెట్టగలదా ఒకచిన్నతుంగపోచ ? ఏదీ ! ప్రళయకాలం లోని ఝంఝూమారుతంయొక్క వేగాన్ని యెదిరించే ఒక చెట్టుని చూపించండి ! ఆలాగే మీవంటి కాంతాశిరోమణుల దాడి కాగే మగవాణ్ణి చూపించండి ! చిన్నప్పటినుండీ స్వాతంత్ర్యంకొరకు ఏడ్చి ఏడ్చి తుదకు స్వాతంత్ర్యము వచ్చే టప్పటికి బుద్ధిపూర్వకంగా మోహాంధుడై మగవాడు కాళ్లకు సంకిళ్లు తగిలించుకొంటాడు. అందుచేతనే నాకు వివాహము చేసుకోవడం అసలు ఇష్టం లేనేలేదు. లొంగినవాణ్ణి లొంగనే లొంగేను, కాని వివాహం చేసుకొని సంపూర్ణమైన దాస్యం అనుభవించాలని నాకేమాత్రం ఇష్టం లేదు. నిజం చెప్పుతా వినండి. వివాహం అంటే నాకు విశ్వాసం లేదు.

విద్యుల్లత.

ఈ ఉపన్యాసం ఎందుకు ? మిమ్మల్ని పెళ్లి చేసుకో

మని యెవరడిగారు ? సరే దానికేం గాని మీరు స్వేచ్ఛాను రాగమతోపాసకులా ? (నవ్వును.)

శశాంకుఁడు.

అవును. తప్పేం ? (నవ్వును.)

విద్యుల్లత.

అయితే మీదగ్గర నేనుండను. అపాయం.

శశాంకుఁడు.

అప్పే, నాదగ్గిరఉంటే మీ కపాయంలేదు. మీరు దగ్గర ఉంటే నాకే అపాయం.

విద్యుల్లత.

పోనీ నేనే దూరంగా ఉంటాను. (అని కొంచె కూడ ముఁగా వెడలును.)

శశాంకుఁడు.

(దగ్గఱకు వెళ్లి) దూరంగా వెళ్లవద్దు. చంద్రికా వియో. గాన్ని భరించగలదా చకోరం ?

విద్యుల్లత.

ఏమో ! చకోరం ఎప్పుడూ చంద్రికకోసం తపిస్తూ ఉంటుందాయేమిటి ? చకోరాని కంత నిలకడ ఉంటుందో ఉండదో ?

శశాంకుఁడు.

చకోరం ఎప్పుడూ చంద్రికాసాన్నిధ్యాన్ని కోరు

తుందో లేదో అది చకోరం ఖర్మం-అంతేకావి చంద్రిక కాసంగ తెందుకు ? తనదగ్గిరకు వచ్చిన చకోరాన్ని తృప్తి పరచడమే చంద్రికకు ధర్మం.

విద్యుల్లత.

అలాగా ? అయితే, అనేక చకోరాలు వస్తూంటే చంద్రిక అన్నిటినీ తృప్తి పరచాలా ?

శశాంకుఁడు.

తృప్తిపరిస్తే తప్పేం ? చంద్రిక తృప్తి పరచడం లేదూ ?

విద్యుల్లత.

అయితే, మొదటవచ్చిన చకోరం బాధపడదూ

శశాంకుఁడు.

తక్కినవాటిని చూచి అసూయచేత బాధపడితే పడుతుంది. అది దాని తప్పుకాని చంద్రిక తప్పు ఏలా అయ్యింది? ఒకవేళ చంద్రికను విడిచి చకోరం ఇంకెక్కడికైనా పోతే చంద్రిక ఆట్టే విచారించకూడదు. అది చకోరం జన్మ హక్కు. తప్పు లేదే !

విద్యుల్లత.

ఆహా ; మీ అభిప్రాయం ప్రకారం ఈ ప్రపంచాన్ని

నడిపించమంటే ఒక్క నిమిషంలో ఈలోకాలని భగ్నం చేసి వేయడానికి సందేహం ఉందా ?

శశాంకుఁడు.

అబ్బే! భగ్నం కాదే, ప్రపంచానికి ఆనందం అప్పుడే. నిత్యకల్యాణం పచ్చతోరణం !

(చారుదత్తుఁడును దుషారకణయు నాట్యమున కనువైన వస్త్రములతోఁ బ్రవేశింతురు.)

తుషారకణ.

మిప్రసంగానికి అడ్డు వచ్చామా ?

విద్యుల్లత.

(నవ్వుచు) అబ్బే, లేదు.

చారుదత్తుఁడు.

ఇక్కడ చల్లగా ఉంది.

తుషారకణ.

ఉండదూ మరీ! (అని యందఱను వేఱువేఱుగాఁ జూచి కొంచెము నవ్వును.)

శశాంకుఁడు.

(తుషారకణతో) మే మిక్కడ మీకొరకు కనిపెట్టుకొని ఉన్నాం. మీ రేం చేస్తున్నారు ?

తుషారకణ.

మనుష్యులు-ఏం చేస్తూంటారో మే మదే చేస్తూన్నాం.
(నవ్వును.)

శశాంకుఁడు.

మనుష్యులు చాలా చేస్తూంటారు. వాళ్లు చెయ్యని దేది? (నవ్వి) ఒకణ్ణి దూషిస్తారు. వాణ్ణే అవసరం వస్తే భూషిస్తారు. నవ్వుతారు, ఏడుస్తారు. దానికీ అర్థం లేదు; దీనికీ అర్థం లేదు. చెప్పేమాటలు చూస్తే ఓ! ఆకాశం అంటుతాయి. చేసేపనులు చూస్తే అసహ్యం వేస్తుంది. ఒకణ్ణి తీసుకువచ్చి ఆకాశాని కెక్కిస్తారు. ఇంకొకణ్ణి పాతాళానికి తొక్కేస్తారు. సాధారణంగా రాజకీయయుగంధరులు చేసే ప నేమిటి? ఇల్లాంటి వట్టి అవకతవకే కాదు? వాళ్లనే అనడ మెందుకు? చాలామంది ఆరకమే. పోనీ ఇక ప్రకృతివిషయం చూడండి. అందమైన చెట్లను కొట్టివేసి ప్రకృతి సౌందర్యమో ప్రకృతిసౌందర్యమో అని ఏడుస్తూంటారు.

తుషారకణ.

ఒకరిని ప్రేమించి ఇంకొకరిని ప్రేమించినట్లు నటిస్తూంటారు. (చిఱునవ్వు నవ్వును.)

శశాంకుఁడు.

ఆలా నటించకపోతే ఇకవాళ్ల బ్రతుకు ఉంటుందా?

విద్యుల్లత.

ప్రేమ, నిజంగా ఉండాలికాని దొంగప్రేమ చూపిస్తే చాలా నష్టం, కష్టంకూడాను.

చారుదత్తుఁడు.

అవును నిజమే. అదీకాక నిజమనీ అబద్ధమనీ ప్రేమకు రెండువిధా లున్నాయా ? అయితే అంతా నిజమే. లేకపోతే అంతా శుద్ధ అబద్ధం.

శశాంకుఁడు.

అబ్బే, అలా అనడానికి వీలులేదు. రెండువిధాలూ ఉంటాయి. ఈలోకంలో అలా ఉంటేనే కాని వీలులేదు. అసత్యం వుంటేనేకాని సత్యం ఏమిటో మన కెల్లా తెలుస్తుంది ? విచారం ఉంటేనే సంతోషం. ఏడువు ఉంటేనే నవ్వు. అజ్ఞాన మున్నప్పుడే జ్ఞానము. అనాకారం ఉన్నప్పుడే సౌందర్యం. భీరుత్వ మున్నప్పుడే ధీరత్వం. చెడ్డ ఉన్నప్పుడే మంచి. కర్త యున్నప్పుడే కర్మ. అది లేనప్పుడిదీ లేదు; ఇది లేనప్పు డదీ లేదు. కాబట్టి రెండూ ఉండాలి. చీక టుంటేనే కదా వెలుతురు ! లేక పోతే మనకు అంతా ఒకటే. అయోమయం. అసంభవం కూడాను.

తుషారకణ.

మీకు వేదాంతంలోకూడా ఇంతప్రజ్ఞ ఉందని నాకు తెలియదు.

శశాంకుఁడు.

కూడా' అంటే అర్థం ?

తుషారకణ.

మరికొన్నింటిలో ప్రజ్ఞ యున్నట్లు స్పష్టమే అనీ.

శశాంకుఁడు.

వేటిలో? (చిఱునవ్వు నవ్వును.)

తుషారకణ.

విద్యుల్లతా ! నువ్వు చెప్పాలి (నవ్వును.)

విద్యుల్లత.

మొండితనంలో—

(అందఱును నవ్వుదురు. శశాంకుఁడుకూడ నవ్వును.)

చారుదత్తుఁడు.

(అపవారించి) ఈవేళ విద్యుల్లతా తుషారకణలలో ఎవ్వరు ఎక్కువ మెరిసిపోతూన్నారో చెప్పండి మరి మీ తెలివిచూస్తా.

శశాంకుఁడు.

(అపవారించి) అయ్యో! వ్యాసఘట్టం వేశారె. రంభకూ ఊర్వశికీ పోలిక లెంచుట ఎట్లా ? ఇద్దరూ అచ్చరలే.

తుషారకణ.

అయితే మీరు ఎప్పుడు చూచి వచ్చారు రంభనూ ఊర్వశినీ ?

శశాంకుఁడు.

ఎందుకూ ? (చకితుఁడై) ఇప్పుడు చూస్తున్నా కాదూ? అయినా మీకు మే మనుకొన్నమాట యెల్లా వినిపించిది ?

తుషారకణ.

చెవులున్నాయి కాబట్టి వినిపించింది. విద్యుల్లతా ! వినలేదూ నువ్వు వా రే మనుకొన్నారో ?

విద్యుల్లత.

వినిపించింది—కొంచెం ఏదో.

చారుదత్తుఁడు.

(గడియారము చూచి) అబ్బా ! రెండుగంటలే.

విద్యుల్లత.

(శశాంకుని జూచి) అయితే ఇంక వెడదాం !

శశాంకుఁడు.

సరే.

తుషారకణ.

వెన్నెల్లో చల్లగా ఉంది. ఇంకా కొంచెంసేపు ఉందాం విద్యుల్లతా ! తొంద రెందుకు ?

విద్యుల్లత.

నాన్నగారు ఏ మంటారో ?

చారుదత్తుఁడు.

నాకు నిద్ర వస్తూంది. నా కారులో మిమ్మల్ని దిగ బెడతా దయచేస్తారా ?

శశాంకుఁడు.

ఎందుకూ అందరం వెడదాం.

విద్యుల్లత.

ఔను.

తుషారకణ.

నేనెంతసేపు ఉండమంటే అంతసేపూ ఉంటానని నాతోఅనలేదూ? మీరు మాత్రం ఉండాలి. విద్యుల్లతని. నే నింక బలవంతపెట్టను. ఆమె తండ్రిగారు ఏమంటారో చారుదత్తునికి నిద్ర అట. ఆగమంటే ఆగుతుందా?

శశాంకుఁడు.

నే నింకేమి చేయను? విద్యుల్లతా !

విద్యుల్లత.

మీ ఇష్టం. నేను వెడతా. సెలవు. (అని యొక తీక్ష్ణమైన చూపు శశాంకునిపై విసరి వెడలును)

చారుదత్తుఁడు.

సెలవు. (వెడలును.)

తుషారకణ.

(ఒకనిమిషము శశాంకుని జూచి చిఱు నవ్వును.)

శశాంకుఁడు.

(తుషారకణ వంక తదేకదృష్టితోఁ జూచుచుఁ గాంచెము వ్యాకులుఁడైనట్లు కనుపట్టి చిఱునవ్వు నవ్వుచు) మీశక్తి అసాధారణం.

తుషారకణ.

ఏమీ తెలియనివారు మీరే పాపం.

శశాంకుఁడు.

(ఆమెను సాభిప్రాయముగఁ జూచును—శశకుఁ దెలియకుండఁగనే)

తుషారకణ.

మీ మనస్సిక్కడలేదుకాబోలు ! ఇక్కడెందు కుంటుంది !

శశాంకుఁడు.

ఏమిటో, నామనస్సు నాకే తెలియడం లేదు. చెప్ప లేని అవస్థలో ఉన్నాను. సంతోషమో విచారమో అంత కంటే తెలియడం లేదు. నిజం చెపుతున్నా—ఏమీ అనుకోకండి. భయంకరంగా మహాజలప్రవాహం పొంగి పొర్లి ప్రవహిస్తూ ఉంది. ప్రచండమైన సుదిగాలి ఆకాశంతో

భూమినీ కలిపివేయా లన్నట్లు హడా విడి చేస్తూంది. ఒక పక్షి ఒకచిన్న ఆకును సుడిగాలికి పడవేసింది-నది కలిసేచోట. ఆయాకు నదిలో కొట్టుకుపోతుందో సుడిగాల్లో యెగిరి పోతుందో తెలియదు మరి—

తుషారకణ.

అర్థం లేని భావకవిత్వంలావున్నాయి మీ మాటలు.

శశాంకుఁడు.

వినండి. ఆ యాకును నే నేను. అర్థం అయిందా?

తుషారకణ.

(తల త్రిప్పుచు) ఊఁహూఁ.

శశాంకుఁడు.

అర్థమైనా-అయిందంటే గొప్పలేదు. నా నోటినుండే చెప్పించా లని.

తుషారకణ.

చెప్పండి ఇంత గొడ వెందుకు!

శశాంకుఁడు.

ఒకవైపు విద్యుల్లత, ఇంకొకవైపు మీరు.

తుషారకణ.

అంటే?

శశాంకుఁడు.

మీ ఇద్దరిలో ఎవరు నన్ను వశపరుచు కుంటారో తెలియదు.

తుషారకణ.

విద్యుల్లత సంగతి నే చెప్పలేను, కాని నేను మిమ్మ ల్ని ఆకర్షించడానికి ప్రయత్నిస్తున్నానని చెప్పేనా? నాకదే పనా? మీరు తప్పు అభిప్రాయం పడుతున్నారేమో!

శశాంకుఁడు.

(కొంచెము కలవెలఁబోయి) కాని, మీ నడతనుబట్టి—

శశాంకుఁడు.

నా నడతలో ఏమైనా తప్పున్నదా?

శశాంకుఁడు.

అబ్బే, అలాకాదు. మీకు నామీద ప్రేమ ఉన్నదను ను, మీరు నాయందు చూపించే అనురాగాన్నిబట్టి.

తుషారకణ.

అయ్యో, ఆడది చేసినదల్లా మోహంకింద కట్టే స్తారు. కొంచెం చను విచ్చి కలిసి మాట్లాడితే ప్రేమట! ఇష్టం చూపిస్తే మోహమట! ఒంటిగా పురుషునితో మా ట్లాడితే తప్పట. ఇంతెందుకు? నవ్వితే తప్పు. చూస్తే

యేదో అర్థం తీయడం. సిగ్గుపడితే టక్కు. పడకపోతే సిగ్గు లేదంటారు. ఆడది యేం చేసినా అర్థాలు వేరే తీస్తూంటారు.

శశాంకుడు.

క్షమించండి ! తప్పు అభిప్రాయంపడ్డానేమో ! చనువుచేత నాహృదయంలో ఉన్నది చెప్పేశాను. మీరు వేరుగా అనుకోవద్దు—

తుషారకణ.

(నవ్వి) తమాషాకు ఏదో—మొత్తంమీద-అన్నాను. కాని మీ రన్నదానిలో తప్పు లేదులెండి. ఔను కాని మీరు విద్యుల్లతను ప్రేమిస్తూన్నారుకాదూ? భయమెందుకుచెప్పండి. (అనుచుఁ దనహస్తమును ప్రేమతోఁ జాచుచు శశాంకుని భుజమ్ముపై వేయును.)

శశాంకుఁడు.

(అదరిపడి) స్త్రీ హృదయం ఒకవ్యాసఘట్టం. అది అర్థం చేసుకోవడమే ?

తుషారకణ.

(చేయితీసి) నే నడిగినదానికి జవాబు చెప్పరూ ?

శశాంకుఁడు.

దేనికి ?

తుషారకణ.

మీ మనస్సు మీలో లేదు. నే నన్నమాట మీకు వినపడనే లేదు.

శశాంకుఁడు.

నామనస్సు నాలో లేదు. నిజమే. (నిట్టూర్పు)

తుషారకణ.

ఎక్కడ ఉన్నది? విద్యుల్లత దగ్గిరా? (అని అసూయాపూర్వకముగఁ బ్రేమదృష్టితోఁ జూచును.)

శశాంకుఁడు.

(ముగ్ధుఁడై) ఆఁ—కా—దు—

తుషారకణ.

(సగర్వముగఁ జిఱునవ్వునవ్వి) మరి ఇంకెవ్వరి దగ్గిర?

శశాంకుఁడు.

చెప్పనా?—మీ—మీ దగ్గిర.

తుషారకణ.

మీరు నన్ను మనస్సాక్షిగా ప్రేమిస్తున్నారా? (అని ప్రేమతో నడుగును.)

శశాంకుఁడు.

ముమ్మాటికీ నిజంగా ప్రేమిస్తున్నా.

తుషారకణ.

(ప్రేమతోఁ జూచును.)

శశాంకుఁడు.

(తుషారకణ చేయిపట్టుకొని) నా కీనిమిషమున మీరు తప్ప ప్రపంచం తెలియడం లేదు.

తుషారకణ.

(చిఱునవ్వు నవ్వి) ఇట్లే యెప్పటికీ ఉండాలి.

శశాంకుఁడు.

మీ మహిమ !

తుషారకణ.

(కన్నులరమోడ్చి సాభిప్రాయముగాఁ జూచును.)

శశాంకుఁడు.

మీరు—కూడా—న—నన్ను—ప్రే—ప్రేమి—స్తూన్నారా?

తుషారకణ.

(సొగసుగాఁ దలయూఁచి సమ్మతి చూపును.)

శశాంకుఁడు.

నా అంత ధన్యుడు ఈ ప్రపంచంలో మఱి—ఒక డున్నాడా ?

తుషారకణ.

(చిఱునవ్వు నవ్వును.)

శశాంకుఁడు.

(నిట్టూర్చును.)

తుషారకణ.

(ప్రేమ కరఁగిపోవు కన్నులలోఁ జూచును.)

శశాంకుఁడు.

(ఆవేగముతోఁ గొంచెము దగ్గఱకు జరగి ఆవైపు చేచూచును.)

తుషారకణ.

(చేయి తీసికొని అఁ-అఁ-అని మోహముగాఁ గొంచెము వెనుకకు జరగును.)

శశాంకుఁడు.

మీరు నన్ను నిజంగా ప్రేమిస్తూన్నారా ?

తుషారకణ.

చెప్పలేదూ ? ఇప్పుడే—

శశాంకుఁడు.

నా కీనిమిషంలో ఏమీ తెలియడం లేదు. ఏదో ఒక విధంగా ఉంది.

తుషారకణ.

ఎల్లా ఉంది ?

శశాంకుఁడు.

చెప్పలేను. మన స్నేమిటో ఎగిరి దూకుతూంది.

సంతోషం—అబ్బే—ఆమాట నాభావాన్ని సరిగ్గా చెప్పలేదు. సంతోషం ఎక్కువైపోయి మనస్సుని కరిగించి వేసి నన్ను ప్రేమలో కలిపివేస్తూంది. మనస్సుయొక్క ఉద్రేకంచేత కాళ్లు కంపిస్తూన్నాయి. కళ్లు మసకలు కమ్ముతున్నాయి. ఒకవిధమైన మంత్రించేత కట్టుపడిపోయి నట్లున్నాను. మీసమ్మోహనాస్త్రంచేత కట్టుపడిపోయినాను. చూచారూ? ఆనందం ఎక్కువైపోయినప్పుడు—ఒకవిధమైన బాధ సుమండీ. మనస్సులో అదో విధంగా ఉంటుంది. ఏదో బరువుగా, నొప్పిగా, తెలిసీతెలియనట్లు ఉంటుంది. అబ్బే—ఆభావం చెప్పడం చాలా కష్టం. ఒకవిధంగా చూస్తే ఎక్కువ సంతోషం వచ్చినప్పుడూ ఎక్కువ విచారం వచ్చినప్పుడూ ఉండేభావాలకు అట్టే భేదం కనిపించదు సుమండీ—రెండూ హృదయాన్ని కలతపెడతాయి. నా మనస్సులో ఉన్న దంతా చెప్పాలని ఉంది కాని చెప్పలేను. మాటలకి శక్తిలేదు-భావాలను అంతా సరీగా చెప్పడానికి.

తుషారకణ.

(మందహాసముతో) నాకు తెలుసును.

శశాంకుఁడు.

(ఆమెను జూచుచు) మీసౌందర్యం మూడులోకాలనూ మోహపెట్టగలదు.

తుషారకణ.

(చిఱునవ్వు నవ్వును)

శశాంకుఁడు.

మీవంటివారు ఉంటే రంభకోసం స్వర్గానికి వెళ్ళడం ఎందుకూ? ఈలోకమే స్వర్గం!

తుషారకణ.

అయితే రంభ నలకూబరుణ్ణికాని ఇం కెవ్వరినీ ప్రేమించదేమో? (చిఱునవ్వు నవ్వును.)

శశాంకుఁడు.

నేనే వా డనుకొండి పోనీ!

తుషారకణ.

మీరు అంతవారే (అని తనహస్తము నొయ్యారముగా నతని భుజముపై నుంచును.)

శశాంకుఁడు.

(ఆమె ముఖము ముగ్ధుఁడై చూచును.)

తుషారకణ.

(చిఱునవ్వు నవ్వును—భావయుతముగ.)

శశాంకుఁడు.

(ఆమె రెండవహస్తమును గ్రహించి భావోద్రేకమున నిట్టూర్పు విడిచి రొకించుక సమీపించి) నాపై నా కింక శక్తి

లేదు. నేను మీఅధీనంలో ఉన్నాను. విద్యుచ్ఛక్తి నాలో ప్రవహిస్తూన్న ట్లున్నది. పిచ్చివాణ్ణి అయిపోయేలా గున్నాను.

తుషారకిరణ.

(అర్ధ నిమీలిత నేత్రములతో) నేనుకూడా మీకు వశమై పోయాను—పూర్తిగా.

(చంద్రమండలమును మేఘమాల యాక్రమించును—మబ్బుచే చీకటి యగును. తెర పడును.)

ద్వితీయాంకము సమాప్తము.

# స్వార్థత్యాగము.

## తృతీయాంకము.

---

(విద్యుల్లత గది.)

**విద్యుల్లత.**

(కిటికీదగ్గఱ నిలఁబడి యాలోచనా నిమగ్నయై కిటికీనుండి బయటికిఁ జూచుచుండును. గవాక్షము దగ్గఱనుండి సోఫాదగ్గఱకు వచ్చుచుఁ దనలో) ఏమో ! నన్ను శశాంకుడు నిజంగా ప్రేమించడం లేదేమో. (నిట్టూర్పు విడిచి కూర్చుండి) ఏమిటో ! మనసులోపల ఏదో ఒకవిధంగా ఉంది. నాకోరిక అంతరికి నెరవేరుతుందో లేదో...... ..ఏమీ పాలు పోకుండా ఉంది ....... భగవంతునిదే భార మంతా....(అని కన్నులు మూసికొని సోఫాచేతిమీఁదఁ దల నుంచుకొనును-సుమారొక యర నిముషము. పిదపఁ దలయెత్తి కన్నులు విప్పి) తుషారకణ శశాంకుణ్ణి ప్రేమిస్తూంది. ఏలాగైనా అతడు తన్నే ప్రేమించేలాగ చేయడానికి ప్రయత్నిస్తూన్నట్టు కనపడుతూంది. సరే శశాంకుడు నిజంగా నన్నే ప్రేమిస్తూన్నట్లైతే—హూఁ—నాకెందుకు—అతడు ? ఇష్టం వచ్చినవాళ్లనే పెళ్లాడతాడు. సుఖి

ప్తారు.........అబ్బ-కాని-ఏమిటో, ఆమాట అనుకుంటే నాకు చెప్పరానంత బాధగా ఉంది. శూలంతో పొడుస్తూన్నట్లుంది. అబ్బా, నేను—ఒకవేళ అల్లా అయితే బ్రతకగలనా? . (నిట్టూర్పు విడిచి) ..కాని నా కింత స్వార్థపరత్వం ఎందుకు? నేను ప్రేమిస్తూన్నట్టే తుషారకణకూడా అతన్ని ప్రేమిస్తూంది. కాని—నా కున్నంత ప్రేమ——ఎందుకుండకూడదూ? అలా అయితే ఒకవేళ శశాంకుడు నన్ను పెళ్లి చేసుకుంటే ఆమె ఎంత బాధపడుతుందో . పోనీ తుషారకణనే పెండ్లి ఆడతా డని నా ఆశ వదులుకొని ఊరుకుందా మంటే. హాఁ....నా తరం కాదు-ఇనపపగ్గాలతో లాగుతున్నట్లు లాగుతూంది నామనస్సుని శశాంకునిరూపం! అబ్బా! శశాంకుణ్ణి నేను విడిచి పెట్టలేను. అతడే లేకపోతే నా కీబ్రతు కెందుకు? ఈ ప్రపంచ మంతా చీకటిగా కనిపిస్తుంది నాకు .. శశాంకా! నువ్వే నాకు భర్తవు కావాలి! నువ్వు కాకపోతే నే నీ లోకంలో ఉండలేను. దేవా! నువ్వేదిక్కు! (అని అర్ధనిమీలితనేత్రియై తలను మరల సోఫాచేతిపై ఆనుకొనును. ఇంతలో టెలిఫోను ధ్వనిచేయును.)

విద్యుల్లత.

(వెడలి టెలిఫోనులో) ఇది వినయభూషణుగారి ఇల్లు. ఆఁ-ఔను—విద్యుల్లతే మాట్లాడుతూంది... ... ఎవరు? . ఓ! తుషారకణా! సరే.. ...ఏ మని చెప్పనూ నాన్నగారి

తో....ఆఁ—రేపు నీ వివాహమా? . . వ—వరుడెవరు? శ—శశాంకుడా! సరే (అని రిసీవరు గట్టిగాఁ బడవేసి యక్కడ దగ్గఱగానున్న కుర్చీపైఁ గూలఁబడును. ఒకనిమిషము తన చేతిలోఁ దన ఫాలభాగముంచి కన్నులు మూసికొనును–తెలిచి–కన్నీటిని కొంగుతోఁ దుడిచికొని) పిడుగుపడినట్టుంది. (నిట్టూర్పు విడిచి) ఎంత భయపడ్డానో అంతా అయింది. అబ్బ! అబ్బా! నే బ్రతకలేను ఇంక; శశాంకా! శశాంకా! ఇక నీవు నావాడవు కావా! . . అయ్యో. . .(వెక్కి వెక్కి యేడ్చును.)

(నేపథ్యమున)

అమ్మా! అమ్మా! (విద్యుల్లత దుఃఖముచే వినలేదు.)

(మరల నేపథ్యమున)

అమ్మా! అమ్మా!

విద్యుల్లత.

(దిగ్గున లేచి కన్నులు తుడుచుకొని) వస్తున్నా నాన్నా! (అని లేచి తలుపు తీయును.)

వినయభూషణుఁడు.

(ప్రవేశించి కూఁతురి వంకఁ జూచి) ఏమమ్మా! ఆలా ఉన్నావు?

విద్యుల్లత.

(రాని నవ్వు తెచ్చుకొని) అబ్బే! ఏమీ లేదు.

## తృతీయాంకము

వినయభూషణుఁడు.

అమ్మా! ఆలా కాదు మతి! చెప్పవూ? ఏం-బద్ధకంగా ఉందా? రాత్రి నిద్ర పట్టలేదూ?

విద్యుల్లత.

ఔను. రాత్రి చాలా ఆలస్యం అయింది. నాన్నా! ఇప్పుడు తుషారకణ టెలిఫోను చేసింది. రేపు వివాహమట ఆమెకును శశాంకునికిన్నీ. మీతో చెప్పమంది.

వినయభూషణుఁడు.

(కూఁతురి ముఖముఁ జూచి వెంటనే దృష్టి మార్చి) ఆలాగా అమ్మా! కాని, నేను ఇంత త్వరలో అవుతుందనుకోలేదు. నిన్న నీకు తెలియదూ? (అని సోఫాపైఁ గూర్చుండును

విద్యుల్లత.

(తెలియదని తల యూఁపును. రవీంద్రునిపటము వైపు చూచును.)

వినయభూషణుఁడు.

అమ్మా! కూర్చో.

విద్యుల్లత.

(తండ్రిప్రక్కఁ గూర్చుండి కన్నీటి నాఁపుకొనలేక) ఇప్పుడే వస్తా. (అని గదినుండి వెడలును.)

వినయభూషణుడు.

(ఆలోచనా నిమగ్నుడగును) విద్యుల్లతకి శశాంకుడం టే ఇష్టమని అనుకొన్నాను. శశాంకుడు మంచివాడే కాని స్థిర చిత్తుడు కాడని నే నిదివరకే గ్రహించాను. ఇంకి తుషారకణని శశాంకుడు పెండ్లాడతాడు. విద్యుల్లతకి కష్టంగా ఉందనుకొంటాను. పాపం; నేను చారుదత్తుని విషయం ఎత్తినపుడు కూడా ఏమీ ఇష్టపడలేదు. మనస్ఫూర్తిగా విద్యుల్లత శశాంకుని ప్రేమిస్తుందా యేమి ఒకవేళ ? అయ్యో ! అలా అయితే చాలా చిక్కు వచ్చిందే? విద్యుల్లత మనస్సు చాలా కష్టపెట్టుకుంటుందేమో ! ఏం చేయను? శశాంకునికి విద్యుల్లత నీయడం నాకంత ఇష్టం లేదు. అందుకే చారుదత్తుని ఇష్టపడుతుందేమో అని అడిగేను. ఆమెకు ఇష్టం లేనట్లు తెలిసింది. చారుదత్తుడు చాలా మంచివాడు. అయితే ఇష్టమనే దానికి ఒక నియమం ఏమిటి ? పోనీ ! శశాంకుడంటే అంత యెక్కువ ఇష్టమేమో కనుక్కొని ఇష్టమైతే అతనికే పెళ్లి చెయ్యాలని ఆవిషయం అడుగుదామనుకొన్నాను. ఇం కిప్పు డెల్లాగ ? ఏమో ! విద్యుల్లత అంత ఎక్కువగా ప్రేమించడం లేదేమో శశాంకుణ్ణి ! ఇష్టం ఉండవచ్చు. కాని, ఇష్టానికీ ప్రేమకీ చాలా భేదం ఉంది. ఏలాగో ఆమె ఇష్టం కనుక్కోవాలి .తల్లిలేని పిల్ల మనస్సు గ్రహించడం ఎంతకష్టం తండ్రికి ?... ....

# తృతీయాంకము

(విద్యుల్లత ప్రవేశించి)

నాన్నా. నేను తుషారకణకు పెళ్ళివేళ బహుమానం ఏ మివ్వను? మనం పెళ్ళికి వెళ్ళినప్పుడు ఏమైనా ఇవ్వాలని ఉంది ఆమెకు.

వినయభూషణుఁడు.

అమ్మా! నీఇష్టం వచ్చింది ఇయ్యి. నీకు తప్ప కుండా వెళ్ళాలని ఉందా తుషారకణ పెళ్ళికి?

విద్యుల్లత.

(ఒకిం—చుక తొట్రుపడి) ఏం? నాకూ తుషార కణకూ స్నేహమే కాదూ? అందుచేత మీ కిష్టమైతే వెడదాం.

వినయభూషణుఁడు.

సరే. కాని ఏమో స్త్రరుగా వివాహం జరుగుతుందో?

విద్యుల్లత.

(కుర్చీపైఁ గూర్చుండి) అంటే?

వినయభూషణుఁడు.

ఏవిధంగా వివాహపుతంతు జరుగుతుందో అని; హిందూశాస్త్రప్రకారమా, లేక ఇంకేమైనా తేలికగా-ఉండే పద్ధతిని జరుగుతుందా? ఆఁ; ఏలా అయితేం?

విద్యుల్లత.

ఇవ్వేళ సాయంత్రం టెన్నీసుకి క్లబ్బుకి వెళ్లా లను

కుంటున్నా. అయిదారురోజులనుంచి వెళ్లడంలేదు. కొంచెం త్వరగా బయలుదేరి తుషారకణ కిచ్చేది ఏదైనా ఒకటి తీసుకొస్తా. (తలుపు తట్టఁబడును.)

వినయభూషణుఁడు.

ఎవరు ? (అని లేచి తలుపు దగ్గఱకు వెళ్లి చూచి) చారుదత్తా ? అమ్మా ! చారుదత్తు వచ్చినాడు.

విద్యుల్లత.

(లేచి) లోపలికి రండి.

చారుదత్తుఁడు.

(ప్రవేశించి) నేను మీ మాటలకు అడ్డురాలేదు గదా ?

విద్యుల్లత.

అబ్బే, ఫరవాలేదు.

వినయభూషణుఁడు.

మీ రిద్దరూ చిన్నవాళ్లు మాట్లాడుకొండి నేను వెడతా (అని వెళ్లి పోవును.)

విద్యుల్లత

ఇలా కూర్చోండి. (అని కుర్చీ చూపించును. తాను వేఱొక కుర్చీపైఁ గూర్చుండును.)

చారుదత్తుఁడు.

(కూర్చుండి) రేపు ఆదివారము శశాంకునికి పెళ్లి

విద్యుల్లత.

(ఇంకొకవైపు చూచుచు) ఔను. విన్నాను.

చారుదత్తుఁడు.

(ఆమెను జూచుచు) నిన్న నాకు తెలియదు.

విద్యుల్లత.

నాకుకూడా ఈవేళే తెలిసినది-ఔనుకాని మీరు ఈవేళ క్లబ్బుకి వెడతారా ?

చారుదత్తుఁడు.

ఏమి ఉంది ఈవేళ ?

విద్యుల్లత.

కొత్త ఏమీ లేదు.

చారుదత్తుఁడు.

మీరు వెడతారా ?

విద్యుల్లత.

ఏమీ తోచనప్పుడు ఏం చెయ్యను ? క్లబ్బుకి వెళ్లి ఏలాగో ఒకలాగు ఈసాయంకాలం గడుపుదా మనుకొన్నా

చారుదత్తుఁడు,

నేను కూడా వస్తాను.

విద్యుల్లత.

నా కోసం మీరు శ్రమ తీసుకోవద్దు.

చారుదత్తుఁడు.

అబ్బే, నేను నాకోసమే వెడతానులెండి. మీకోసం కాదు పోనీ. (అని చిఱునవ్వు నవ్వును.)

విద్యుల్లత.

(నవ్వుచున్నట్లు నటించును.)

చారుదత్తుఁడు.

మీకు కొంచెం అస్వస్థతగా ఉన్నట్లుంది. నే నేమీ శ్రమ ఇవ్వడంలేదు కదా ?

విద్యుల్లత.

అబ్బే, ఏమిశ్రమ ?

చారుదత్తుఁడు.

ఈవేళ మంచినాటకం ఉంది. మీరు నాయందు దయ ఉంచి రావాలి.

విద్యుల్లత.

క్షమించాలి. ఈవేళ రాలేను.

చారుదత్తుఁడు.

కారణం అడగవచ్చా ?

విద్యుల్లత.

అబ్బే, ఏమీ లేదు. నిన్న నిద్రలేదు. ఈవేళకూడా నిద్రలేకపోతే బద్ధకం చేస్తుందేమో అని.

చారుదత్తుఁడు.

కాని, చాలా మంచినాటకం. మీరు తప్పకుండా చూడవలసిన నాటకం. ఆట్టే ఆలస్యం అవమకూడాను. పన్నెండుగంటలకు ముందే అయిపోతుంది.

విద్యుల్లత.

క్షమించాలి.

చారుదత్తుఁడు.

నన్ను మీరే క్షమించాలి. మీరు దయచేసి తప్పక రావాలి. మీరు కాని రాకపోతే నేనుకూడా వెళ్లను.

విద్యుల్లత.

అయ్యో, నేను రాకపోతే మీరు వెళ్లకపోవడ మేమిటి ?

చారుదత్తుఁడు.

నేను నిజంగా వెళ్లను. ఒక్కణ్ణే వెడితే ఏమి ఉర దాగా ఉంటుంది ?

విద్యుల్లత.

మీరు ఇంతగా కోరుతున్నా నేను రాకపోయి

నందులకు 'నన్ను క్షమించండి. నాకు అసలు ఈవేళ ఏం ...(అని ఆపివేసి-తడుము కొనును.)

చారుదత్తుఁడు.

ఏం ?

విద్యుల్లత.

అబ్బే ! నా నాకు ఈవేళ కొంచెం-బద్ధకంగా కూడా ఉంది. రాత్రి చాలా ఆలస్యం అయింది పడుకొనే టప్పటికి.

చారుదత్తుఁడు.

సరే-కాని, నేనుకూడా ఈవేళ వెళ్లను.

విద్యుల్లత.

అయ్యో-అదేమిటి ?

చారుదత్తుఁడు.

ఇంకోసారి మీరు వచ్చినప్పుడు వెడతాను. ఇల్లాంటి నాటకాలు మళ్లీ రాకుండా ఉంటాయా ?

విద్యుల్లత.

మీరు వేరుగా తలవరు కదా? నేను ఈవేళ రానందుకు-?

అబ్బే, పాపం, మీకు సుస్తీగా ఉంటే ఏలా... కాని మీరు క్లబ్బుకి ఎప్పుడు వెడతారు ? చెప్పితే నే నిక్కడకు వచ్చి మిమ్మల్ని తీసుకొని వెడ్తాను.

విద్యుల్లత.

సుమారు నాలుగు గంటలకు వెళ్లాలని ఉంది. కాని, నాకు కొంచెం పని ఉంది. అందుచేత నేను మిమ్మల్ని క్లబ్బులో కలుసుకుంటా.

చారుదత్తుఁడు.

నాతో మీరు వచ్చే భాగ్యం నాకు లేదు.

విద్యుల్లత.

క్షమించాలి. వేరుగా తలపవద్దు.

చారుదత్తుఁడు.

(ఆమెను జూచును)

విద్యుల్లత.

(తన నఖములవంకఁ జూచుచుండును.)

చారుదత్తుఁడు.

మీరు చాలా బాగా పాడతారు.

విద్యుల్లత.

అబ్బే.

చారుదత్తుఁడు.

ఒక చిన్నపాటపాడి నన్ను కృతార్థుణ్ణి చేయండి ! మీకు కష్టం లేకపోతే.. వద్దులెండి, సుస్తీగా ఉన్నది మీకు.

విద్యుల్లత.

పరవాలేదు కాని నేను బాగా పాడలేనండీ !

చారుదత్తుఁడు.

పోనీ నాకు మాత్రం బాగానే ఉంటుంది. అందుచేత దయచేసి నా ఈకోరిక ఐనా తీర్చరూ? ఇంతకూ శరీరశ్రమ లేకపోతేనే.

విద్యుల్లత.

మీరు అల్లా అడుగుతున్నారు కాబట్టి నాకు వచ్చింది ఏదో ఒకటి పాడతాను. (ఆలోచించి)

(మరుంగీ మరుంగీ సఖీ అనుమాదిరి.)

" చాలులే—చాలులే- వీణ యింకచాలులే ॥చాలు॥

దుందుభులస్వనములు—దూరమున వినఁగ వచ్చె

అమితదుఃఖమొదవుచుండె—నయ్యయ్యో ॥చాలు॥

మనసు—బరువు—ఎక్కుచుండె—మాటలాడశక్తి—లేదే

కంటినీరు కాల్వ లయ్యె—కారణంబు చెప్పలేను

రక్త మదిగొ కాఱుచుండె—ప్రాణహింస చూడలేను

॥చాలు॥

2 ప్రియవరుని నేను—వీక్షించుచుండగానె

అకట కొనిపోయినారు—హా—హా—హా ॥చాలు॥

3 దాస్య మింక—తప్పదయ్యె—తన్నులైన—తప్పవయ్యె

వెన్నిదినము లింక నిటుల—ఏడ్వగలనుదేవ...దేవ...

విరహ మింక నోర్వలేను—వేగమె కొనిపొమ్ము . .

నన్ను ॥చాలు॥

(కన్నీటిచుక్క- లొకటిరెండు రాలును.)

చారుదత్తుఁడు.

ఆహా ! ఎంతహాయిగా ఉన్నదో నేను చెప్పలేను.

విద్యుల్లత.

(చిఱునవ్వు నవ్వును-నవ్వురాకయే)

చారుదత్తుఁడు.

గంధర్వగానం అంటే ఇదే కాబోలు. కోయిల స్వరాన్ని మించిపోయి ఉంది మీపాట. మీపాటలో నేను మునిగి పోయాను. తన్మయం అయిపోయింది నామనస్సు. నేను ఒక్కణ్ణే కాదు ! ప్రకృతి అంతాకూడా మీపాటచే స్తంభించి పోయినట్లుంది. నేను నాభావాన్ని చెప్పలేను. ఎక్కువ ఆనందం వచ్చినప్పుడు మాటలాడకపోతేనే భావ ప్రకటన బాగా ఔతుంది.

విద్యుల్లత.

(పరధ్యానముగఁ జూచుచుండును.)

చారుదత్తుఁడు.

మీరుకూడా పాటలో ఐక్యం అయిపోయారు. మీ గాన మహిమ.

విద్యుల్లత.

(తెలివి నొంది) అబ్బే. (తలుపుపైఁ జప్పుడు. చారుదత్తుఁడు చూచును. విద్యుల్లత కన్నులు తుడుచుకొనును.)

వినయభూషణుఁడు.

(తలుపువొద్దఁ బ్రవేశించును.)

చారుదత్తుఁడు. }
విద్యుల్లత. }

(లేచెదరు.)

విద్యుల్లత.

(చారుదత్తు నుద్దేశించి) నేనింక సెలవు తీసుకొంటాను మీరు నాన్నగారితో మాట్లాడ వచ్చును.

చారుదత్తుఁడు.

సెలవు (ఆమె వంకఁ దదేకదృష్టిగఁ జూచును.)

విద్యుల్లత.

(లోనికిఁ బోవుచుండును.)

వినయభూషణుఁడు.

ఏ మమ్మా! వెడుతున్నావా ?

విద్యుల్లత.

కొంచెం తల నొప్పిగా ఉంది.

వినయభూషణుఁడు.

డాక్టర్ని రమ్మననా ?

విద్యుల్లత.

అబ్బే. అక్కరలేదు. విశ్రాంతిగా కొంచెం పడుకుంటే అదే తగ్గుతుంది.

చారుదత్తుఁడు.

నేను శ్రమ ఇవ్వడం వల్ల వచ్చిన దేమో ?

విద్యుల్లత.

అబ్బే. (అని నిష్క్రమించును.)

వినయభూషణుఁడు.

చారుదత్తా ! కూర్చో. (అని తాను గూర్చుండును.)

చారుదత్తుఁడు.

(కూర్చుండును.)

వినయభూషణుఁడు.

శశాంకునికి వివాహ మట విన్నావా ?

చారుదత్తుఁడు.

ఔను. ఈవేళే విన్నాను.

వినయభూషణుఁడు.

తుషారకణ తా నెప్పుడూ వివాహం చేసుకో నని చెప్పుతూ ఉండేది !

చారుదత్తుఁడు.

అలాంటి వాళ్లే తప్పకుండా చేసుకొంటారు.

వినయభూషణుఁడు.

(తల వంకించును.)

చారుదత్తుఁడు.

మీ రిద్దరి దాంపత్యమూ చాలా బాగా ఉండాలి. మరి-మీ రిద్దరికీ కూడా నవనాగరి కాభిప్రాయాలే.

వినయభూషణుఁడు.

ఈ కాలాన్ని నవనాగరి కాభిప్రాయాలు లేని వాళ్లు ఉండడమే కష్టం. అందరికీ నవనాగరి కాభిప్రాయాలే.

చారుదత్తుఁడు.

అవును, కాని—పడుచువాళ్లలోకూడ అభిప్రాయాల్లో భేదం లేకపోలేదు. కాదూ ?

వినయభూషణుఁడు.

అవును.

చారుదత్తుఁడు.

(ఏదియో యాలోచించుచుండును.)

వినయభూషణుఁడు.

ఏమిటి ఆలోచిస్తున్నట్లున్నావు ?

చారుదత్తుఁడు.

ఏమీ లేదు-తమకు ఒక ఉత్తరం ఇచ్చి నేనింక సెలవు తీసుకుంటా. మళ్లీ దర్శనం రేపు చేస్తా. (అని రెండులేఖలు తీసి యొకటి వినయభూషణున కిచ్చి లేచును.)

వినయభూషణుఁడు.

(వృద్ధునికొని చూచి) తొందరగా వెళ్లుచున్నావేమి ? పని ఉందా ?

చారుదత్తుఁడు.

చిత్తం-సెలవు. (వెళ్లుచు బల్లపై రెండవలేఖ యుంచి నిష్క్రమించుచు.)

వినయభూషణుఁడు.

(లేఖ విప్పి చదివి చిఱునవ్వు నవ్వి) విద్యుల్లత ఇతణ్ణి వివాహం చేసికొంటే ఎంతబాగా ఉండును. ఈమెకు ఇంకా వివాహం కాలేదని నామనస్సు ఎంతోబాధపడుతూంది. ఆమెకు ఇష్టంలేని వాని కిచ్చి చేయడం నా కిష్టంలేదు. నాకు వంట్లో చూస్తేసుస్తీగా ఉంది. ఎప్పు డీశ్వరాజ్ఞ అవుతుందో ఈప్రపంచం విడిచి పెట్టమని. విద్యుల్లతను అనాథనుగా చేయడం అంటే-అబ్బా! నాకు-శూలపోటులా పొడుస్తూంది హృదయంలో అలా తలుచుకుంటేనే. నా దేహస్థితికితోడు ఈ మనోవిచారం కూడా నా వ్యాధిని ఇంకా వృద్ధిచేస్తూన్నది- - - అబ్బే, నా అజ్ఞానంకాని, ఎందు కీసంసారపుగొడవ ? అయినా, అంతా దైవేచ్ఛ! నేనుచెయ్యాలని ఈ అహంభావము నా కెందుకు? చేయించేవాడు ఈశ్వరు డొక్కడే ! - - - ఏదో నేను కర్త నని అజ్ఞానంలో పడడమేకాని నాలో ఏమి ఉంది?

—ఐనా కర్మ చేయడం మనుష్యధర్మం (లేచి తలుపు దగ్గఱకు వెళ్లి యచటనున్న లేఖను జూచి నవ్వి నిష్క్రమించును.)

(రెండుమూడు నిమిషములకు విద్యుల్లత ప్రవేశించును.)

విద్యుల్లత.

(లేఖను జూచి తీసి చదువును) ఛీ....(అని చింపివేయును. సోఫాదగ్గఱకు వెళ్లుచు) నన్ను వివాహం చేసుకోమనా... నాన్నకూడా వ్రాశాడట! ..నాకు వివాహం ఏమిటి ఇంకా (అని సోఫాపైఁ గూర్చుండును. 11 గంటలు నెమ్మదిగా విని పించును. గడియారము వైపు చూచి) పదకొండు!....అనంత మైన ఈకాలానికి విభజన ఏమిటి? .ఆరుగంటలైతే ఎంతో పదకొండు గంటలైనా అంతే నాకు. ..(ఆలోచించి) కాని ఈగడియారం మాత్రం రోజూ గంటలు కొట్టకమానదు ... పాపం విసుగులేదు. దాని ధర్మం అది చేస్తూంది. (మెల్లఁగా ఆలోచనతో) దాని ధర్మం అది చేస్తూంది....సూర్యుడు రోజూ ఉదయిస్తూన్నాడు .రోజూ అస్తమిస్తూన్నాడు. నక్షత్రాలు మెరుస్తూన్నాయి-కాని ఉన్నంతసేపూ పరిమళిస్తూన్నాయి—వాటి ధర్మం అది—ఎండవచ్చినా పరిమళమే—వాన వచ్చినా పరిమళమే—కష్టంలోనూ, సుఖంలోనూకూడా వాటి ధర్మం అవి నెరవేరుస్తూన్నట్టు కనిపిస్తూఉన్నాయి—నేనుమాత్రం ఎందుకు వీటిని అనుకరించకూడదూ? ...నాకు—సుఖం ఎల్లాగా లేదు. ధర్మమైనా నెరవేర్చవద్దూ?.. .పువ్వులు—

తమ పరిమళంవల్ల తాము ఏమీ లాభం పొందడం లేదు. వాటికి లోకసేవ ముఖ్యం-స్వార్థం లేదు . . సెబాస్ ! స్వార్థత్యాగ మంత ఉత్కృష్టమైనది-ఇం కేమి ఉంది ?—మనం కష్టపడ్డా-ఇతర్లను సంతోషపెట్టడమే మనుష్యులకు ధర్మం . . .అందులో, ఇం కొకధర్మానికి అడ్డు రానప్పుడు తల్లిదండ్రులను సంతోషపెట్టడం న్యాయం.... అందుచేత కొంత-ఋణవిముక్తికూడా ఔతుంది ..నేను-శశాంకుణ్ణి వివాహం చేసికోకపోయినా నాకు అతడే ప్రాణేశ్వరుడు. నామనస్సులో అతని రూపమే శాశ్వతంగా ప్రకాశిస్తూ ఉంటుంది....నాతండ్రికి—నేను వివాహం చేసుకోకపోతే మనస్సులో శాంతి ఉండదు. . కృశించిపోతాడు...చారుదత్తునికి నే నంటే—పాపం, చాలా ఇష్టం .... నేను—అతన్ని వివాహం చేసుకోకపోతే—చెప్పరానంత కష్టపడతాడు. తప్పకుండా ఈపాపమంతా నాకే చుట్టు కుంటుంది .. పాపం, చారుదత్తునిప్రేమ నిష్కళంక మైనది. నాకు సహజమైనప్రేమ లేకపోయినా అతని అవ్యాజమైన ప్రేమకు నమస్కరించాలి. నాలాగే ఎంతకష్టపడతాడో నేను పెండ్లాడకపోతే? అది కాకుండా ఇది నాధర్మం—కుమార్తె ధర్మం నెరవేర్చాలి. ఇంతటినుంచి నాసుఖానికి సెలవు. నేను నవ్వే నవ్వల్లా ఒకవేడి నిట్టూర్పును కప్పి పుస్తుంది. (శిరస్సు చేతిలోఁ జేర్చుకొని, కన్నులు మూసికొని కూర్చుండును.)

వినయభూషణుఁడు.

((ప్రవేశించి) అమ్మా !

విద్యుల్లత.

(లేచును )

వినయభూషణుఁడు.

భోజనానికి రావూ ?

విద్యుల్లత.

వస్తా.

వినయభూషణుఁడు.

చారుదత్తుడు నాకు వ్రాసిన ఈ ఉత్తరం చూడు.
(ఇచ్చును )

విద్యుల్లత.

(చదివి తిరిగి యిచ్చును.)

వినయభూషణుఁడు.

(కుర్చీమీఁద గూర్చుండి) ఏమని జవా బివ్వను ?

విద్యుల్లత.

మీ ఇష్టం.

వినయభూషణుఁడు.

అలా కాదమ్మా ! నీఅభిప్రాయం చెప్పు !

విద్యుల్లత.

(సందేహించును.)

వినయభూషణుఁడు.

చెప్పు-నీ కిష్టమైతే "సరే" అను-లేకపోతే "వద్దు" అను-చారుదత్తుతో చెప్పి వెయ్యాలి ఇంక—ఎన్నాళ్లు అత ణ్ణి సందిగ్ధావస్థలో ఉంచను? చాలా మంచివాడు పాపం.

విద్యుల్లత.

సరే.

వినయభూషణుఁడు.

(చిఱునవ్వుతో) ఏమమ్మా! నీకిష్టమేనా నిజంగా? ఇదివరకు అడిగినప్పుడు నువ్వు వద్దంటే ఇష్టం లేదేమో అని అనుకున్నాను నీవు ఏదో ఆలోచించకుండా అన్నావని.— చారుదత్తువవంటి యువకుడింకొకడు దొరకడం చాలా కష్టం. ఏమమ్మా! నీవు నిజంగా వివాహం చేసుకొంటావా చారుదత్తుణ్ణి? నీ కిష్టం లేనిదే నాకు చెయ్యడం ఇష్టంలేదు.

విద్యుల్లత.

(అంగీకారసూచకముగాఁ దల యూఁచును.)

వినయభూషణుఁడు.

భగవంతుడు నిన్ను రక్షించుగాక! ...భోజనానికి ఆలస్యం అయినది. వెడదాం వస్తావా? (లేచును.)

స్వార్థత్యాగము

విద్యుల్లత.

వస్తా.

(తలుపు చప్పుడగును.)

వినయభూషణుఁడు.

రావచ్చు.

(తుషారకణ ప్రవేశించును.)

తుషారకణ.

(వినయభూషణుని పాదములకు నమస్కరించును.)

వినయభూషణుఁడు.

(నమస్కారమును గ్రహించి యామెను లేవఁదీసి) అమ్మా! నీకు వివాహ మని విని చాలా సంతోషించాము. భగవంతుఁడు మీకు సుఖం కలుగజేయవలె నని నా ప్రార్థన.

తుషారకణ.

ఉదయాన్నే రావా లనుకొన్నా. కాని పని తొందరచేత రావడానికి వీలు కాలేదు. అందుచేత టెలిఫోను చేశాను. (విద్యుల్లతను సమీపించి) విద్యుల్లతా! దూరంగా నిలుచున్నావేమి?

విద్యుల్లత.

ఏమీ లేదు. ఈ ఆనందంలో నన్ను ఆనవాలు పట్టగలవో లేవో చూదా మని (నవ్వి సమీపించి యామె కరము గ్రహించును)

తుషారకణ.

నీన్ను ఎప్పుడైనా మరచిపోతా

విద్యుల్లత.

స్నేహ, తమాషా కన్నానుః నీ వివాహ మని చాలా సంతోషం. కాని మమ్మల్నీ అందరినీ విడిచిపెట్టి వెడతా వనీ విచారంగాకూడా ఉంది.

తుషారకణ.

ఎక్కడున్నా ఈ ఊళ్లోనే కాదూ?

వినయభూషణుఁడు.

స్నేహితురాం డిద్దరూ కబుర్లు తర్వాత చెప్పుకోవచ్చు. ఇప్పటికి త్వరగా ముగించి భోజనానికి రండి (అని నిష్క్రమింపఁబోవును.)

తుషారకణ.

క్షమించాలి-చాలా పని ఉంది ఈవేళ.

విద్యుల్లత.

ఎంతసేపు? భోజన మైన వెంటనే వెళ్లవచ్చు. తప్పకుండా భోజనం చెయ్యాలి-

వినయభూషణుఁడు.

ఔ నమ్మా! భోజనంచేసి మరీ వెళ్లు.

తుషారకణ.

మీ ఇద్దరూ ఇంత చెపుతున్నా వెళ్లుతూన్నందుకు ఏమీ

అనుకోవద్దని నాప్రార్థన. అయినా ఇక్కడ భోజనం చెయ్య డానికి నన్ను పిలవవలసిన అవసరంలేదే! నా కిదేమికొత్త? ఎన్నిసార్లు భోజనం చెయ్యలేదు? ఇక్కడ భోజనానికి కూర్చుంటే రెండుగంట లవుతుంది యెల్లా లేదన్నా—అందు చేత....

వినయభూషణుఁడు

సరే నమ్మా!

తుషారకణ.

తమరు వేరుగా తలపవద్దు.

వినయభూషణుఁడు.

అల్బే.

తుషారకణ.

విద్యుల్లతా! ప్రస్తుతం సెలవా?

విద్యుల్లత.

సెలవు.

తుషారకణ.

(వినయభూషణునికి నమస్కరించి నిష్క్రమించును.)

వినయభూషణుఁడు.

ధా అమ్మా! (అని నిష్క్రమించును.)

విద్యుల్లత.

(తుషారకణ వెళ్లిన వైపే చూచుచుండును. దృష్టిమార్చి నిట్టూర్పు విడిచి గవాక్షముదగ్గఱకు వెళ్లుచు) ఈ ప్రపంచంలో కొందరు ఏడుస్తూంటారు. అదే సమయంలో కొందరు నవ్వుతూంటారు..... .ఎవరి ఖర్మం వాళ్లది.. .....

(కిటికీ దగ్గఱనిలువఁబడి తుషారకణను జూచి చేయి యూఁపును )

(తెరపడును.)

తృతీయాంకము సమాప్తము.

---

# స్వార్థత్యాగము.

## చతుర్థాంకము.

---

(మూఁడుసంవత్సరములతరువాత - చారుదత్తుని శయన గృహము. ఒకచోట గోడకు దగ్గఱగా నొక విశాలమైన మంచ ముండును. దానిప్రక్క నొకబల్లయు దానికి సమీపమున నొక ద్వారము నుండును. మంచమునకుఁ గొంచె మెడముగా నొక డ్రెస్సింగుటేబిలును, దగ్గఱ నొకకుర్చీయు నుండును. ప్రేక్షకుల కెదురుగానున్న గోడకు ముఖ్యద్వార ముండును. రంగమునఁ బ్రేక్షకులకుఁ గుడివైపున గోడకు నడుమ బీరువా యుండును. ఆవైపుననే ప్రేక్షకులవైపు కొంచెము వంకరగా సోఫా యుండును.)

చారుదత్తుఁడు.

(బంచెయుఁ జొక్కాయును ధరించి మంచముపైఁ గూర్చుండి చిన్నసంచిలో నేమేమో పెట్టుచుండును. మంచముపైఁ గొన్ని వస్త్రవిశేషము లుండును.)

విద్యుల్లత.

(డ్రెస్సింగు టేబిలునుండి తీసి యేమేమో అందిచ్చుచుండును.)

చారుదత్తుఁడు.

(ఈల వేయుచుండును.)

విద్యుల్లత

ఎందుకు ఇంతకష్టపడడం ? ఎవ్వర్నైనా పెట్టమన కూడదూ ?

చారుదత్తుఁడు.

నాకు కొన్ని సామాసులు ఒకళ్లు పెడితే నచ్చవు. స్వయంగా సర్దుకుంటేనే బాగా ఉంటుంది ..కాని, పాపం, నీవు అందిచ్చి చాలా అలిసిపోతున్నావు. థ్యాంక్సు, కూర్చో.

విద్యుల్లత.

నా కేమీ అలసట లేదు. ఇ దొక పనా ?

చారుదత్తుఁడు.

నీవంటి భార్యరావడం నాకు గొప్ప అదృష్టం (చూచి చిఱునవ్వు నవ్వును.)

విద్యుల్లత.

(నవ్వి) అబ్బే ! మీకు నామీద ప్రేమచేత అలా అం టూన్నారు అంతేకాని .

చారుదత్తుఁడు.

కాని, " మీరు " అని నన్ను మన్నించవద్దని ఎన్ని సార్లు చెప్పలేదు ?

విద్యుల్లత.

" మీరు " అని వాడడం అలవాటైపోయింది పెళ్లి కాకముందునుంచీ.

చారుదత్తుఁడు.

నాకు మాత్రం ఆలాంటి అలవాటు లేదూ. "నీవు" అని నే నిప్పుడు అనడంలేదూ? అందుచేత నన్ను "నీవు" అనే అనాలి. ఇది నాకోరిక.

విద్యుల్లత.

మీరు-అఁ-నీవు ఏలా అనమంటే అలాగే అంటాను; కాని నాకు అదో విధంగా ఉంటుంది. ఇలా పిలవడం.

చారుదత్తుఁడు.

సరే-నీకు "మీరు" అనా లని ఉంటే—అలాగే అను ఫరవాలేదు.

విద్యుల్లత.

మీ కిష్టం లేకపోతే అనను.

చారుదత్తుఁడు.

అబ్బే! నాకు అయిష్టంలేదు! ఎల్లా అంటే ఏమి ఉంది? నే నెందు కన్నానంటే, నాకు భార్యాభర్త లిద్దరూ సమానం. అందుచేత మన్నిస్తే ఇద్దరూ మన్నించాలి. లేక పోతే ఇద్దరూ మన్నించ నక్కరలేదు ఒకర్నొకరు- ఐనా నీవు "మీరు" అన్నంతమాత్రాన్ని ఏమి ఉంది? సొరుగులోనాబొత్తాలు ఉన్నాయి. ఇవ్వవూ? ప్లీజ్!

విద్యుల్లత.

(తీసి యిచ్చును.)

చారుదత్తుఁడు.

(సంచిలో నుంచుచు) కాని, ఇదేమిటి! అప్పుడే నిండిపోయింది?

విద్యుల్లత.

నే సర్దుతా ఇస్తారా?

చారుదత్తుఁడు.

ఊఁ.

విద్యుల్లత.

(కూర్చుండి సర్దుచుండును.)

చారుదత్తుఁడు.

సామానుపై స్టీమరు కాగితాలు అంటింపించాలి. మరి మన స్టీమరులో గది నెంబరు వాటిమీద వ్రాయించాలి.

విద్యుల్లత.

సరే.

చారుదత్తుఁడు.

జెనోవానుంచి విమానంమీద వెడతాం వియన్నాకు.

విద్యుల్లత.

నాన్నగారు ఎక్కుతా మన్నారా విమానం?

చారుదత్తుఁడు.

ఎక్కుతా మన్నారు.

విద్యుల్లత.

ఎన్నిగంటలకి బొంబాయి మెయిలు ?

చారుదత్తుఁడు.

రాత్రి తొమ్మిది న్నరకి.

విద్యుల్లత.

(సంచిలో నన్నియు సర్ది మూఁతవేయును.)

చారుదత్తుఁడు.

ఎంత బాగా సర్దినావు ? చాలా బాగా పట్టించావు అన్నీ !

విద్యుల్లత.

(లేచి) సామానుసంగతి కనుక్కొస్తా (అనివెడలును)

చారుదత్తుఁడు.

(మంచము దగ్గఱనున్న తలుపు తెఱచి లోపలికి వదలి తన డ్రెస్సింగు గౌను చేతిమీఁద వేసికొని మరలఁ బ్రవేశించును. ముఖ్యద్వారము తలుపు తట్టఁబడును.) ఎవరు ? (తలుపుతీయును) ఒకటే ఉత్తరం ?

(నేపథ్యమున మఱియొక కంఠము)—చిత్తము.

చారుదత్తుఁడు.

(తలుపు మూసి డ్రెస్సింగుగౌను కుర్చీపై వేసి లేఖ చదువుకొని) అయ్యో ! ఆఖరికి ఇల్లా అయింది ! (కూరుచుండును.)

విద్యుల్లత.

(ప్రవేశించును.)

చారుదత్తుఁడు.

శశాంకుడును, తుషారకణయు ఒకర్ని ఒకరు విడిచి పెట్టేశారట! షికాగోలో ఉన్నప్పుడు డైవోర్సు పుచ్చుకొన్నారట!

విద్యుల్లత.

అఁహాఁ?

చారుదత్తుఁడు.

నేను ఈలా అవుతుం దని ఎప్పుడూ అనుకోలేదు.

విద్యుల్లత.

నిజమే?

చారుదత్తుఁడు.

ఇప్పుడే ఉత్తరం వచ్చింది. శశాంకుడు నిన్నే ఈ ఊరు వచ్చాడట.

విద్యుల్లత.

తుషారకణ ఎక్కడుందో?

చారుదత్తుఁడు.

ఆమె సంగతి ఏమీ వ్రాయలేదు. శశాంకుడు వ్రాశాడు ఈఉత్తరం. నిన్న టెల్లిఫోను ఇచ్చాడట మనం ఉన్నామేమో అని. మన బంగాళాలో ఎవరో మనం యూరప్కి వెళ్లేమని చెప్పేరట. అందుచేత మనకి ఎక్కడున్నా

అందుతుం దని వ్రాశాడు. ఎవరు చెప్పేరో ? బహుశా వెడుతున్నా మని చెపితే వెళ్లే మని అర్థం చేసుకొన్నాదేమో?

విద్యుల్లత.

అవును.

చారుదత్తుఁడు.

(లేచి) ఒకసారి కారుమీద వెళ్లి తీసుకొస్తా శశాంకుణ్ణి.

విద్యుల్లత.

ఎందు ...

చారుదత్తుఁడు.

ఏం ?....

విద్యుల్లత.

అబ్బే....మరి. ఎండలో వెడతా రని.

చారుదత్తుఁడు.

ఈవేళ అసలు ఎండ తక్కువగా ఉంది. ఐనా నాకేమి ఎండ. .. ? (అని వెడలును.)

విద్యుల్లత.

(ఆలోచించుచు) సాధ్యమైనంతవరకు శశాంకుణ్ణి చూడకుండా ఉండా లని ప్రయత్నించాను ........ ఈవేళ ఎల్లాగా....శశాంకుడు వస్తున్నాడు....చూడవచ్చు నని మగ

స్సులో అదొకవిధమైన సంతోషం అప్రయత్నంగా తెలియకుండగా పుట్టింది. ఛీ....మనస్సు ఎంత బలహీన మైనది! నిజంగా ఆలోచిస్తే భయంగానే ఉంది శశాంకుణ్ణి చూడడమంచే-మనస్సులో తాపం పుడుతూ ఉంది! దాహం అవుతూంది! ఇలాంటి అవస్థ ఎప్పుడూ పొందలేదు. సంతోషమా ? విచారమా? నా చరిత్ర తలుచుకొంటే నాకే నవ్వువస్తూ ఉంది. సంతోషంవల్ల వచ్చే నవ్వుకాదు! ఇది విచారంవల్లా అశక్తతవల్లా వచ్చే నవ్వు ...నాకపటాన్ని భగవంతుడు క్షమిస్తాడా? (అని కుర్చీమీఁదఁ గూర్చుండును.)

(నేపథ్యమున)

చారుదత్తుఁడు.

మీకోసం ఇప్పుడే బయలు దేరాను.

శశాంకుఁడు.

మీరు లేరనుకొని ఉత్తరం వ్రాశాను. టెలిఫోనులో తప్పు విన్నా బహుశా. ఈవేళ మీ మామగారు కనిపిస్తే మీ రందరూ ఉన్నా రని తెలిసికొని వచ్చాను.

చారుదత్తుఁడు.

విద్యుల్లత ఈగదిలో ఉంది. రండి. మీరు కొత్తవారా ఏమిటి ?

విద్యుల్లత.

(సంభ్రమముతో లేచి) శశాంకుడు వస్తూన్నట్టు ఉన్నాడు....

(చారుదత్తుఁడును శశాంకుఁడును ప్రవేశింతురు.)

విద్యుల్లత.

(శశాంకుని గాంచి నమస్కరించును.)

శశాంకుఁడు.

(ఆమెను గాంచి నమస్కరించును.) చాలా రోజులైనది మిమ్మల్ని ఇద్దర్నీ చూచి-మీరు కులాసాగా ఉన్నారా?

విద్యుల్లత.

ఆఁ. కులాసాగానే ఉన్నాము. మీరు క్షేమమేనా?

శశాంకుఁడు.

మీ దయచేత....

విద్యుల్లత.

సెలవు తీసుకు వెడతా (చారుదత్తుని జూచి) మరి కొన్ని స్టీమరు కాగితాలు తెప్పించవలసి ఉంటుంది.

(అని నిష్క్రమింపఁబోవును.)

చారుదత్తుఁడు.

సరే. కాని, నీవు ఎక్కడికి వెడుతున్నావు?

విద్యుల్లత.

నాసామాను ఇంకా సర్దాలి.

చారుదత్తుఁడు.

ఫరవాలేదు. శశాంకుడు ఇన్నాళ్లకు వచ్చాడు. కూర్చో కూడదూ కొంచెం సేపు?

విద్యుల్లత.

(కుర్చీ సోఫాదగ్గఱకు లాగి, కూర్చుండి)
కూర్చోండి.

చారుదత్తుఁడు.
శశాంకుఁడు.

(సోఫాపైఁ గూర్చుందురు.)

శశాంకుఁడు.

(విద్యుల్లతవైపు చూచును.)

విద్యుల్లత.

(భర్త పాదములను జూచును.)

శశాంకుఁడు.

మీరు యూరపులో ఎంతకాలం ఉంటారు?

చారుదత్తుఁడు.

చెప్పలేను. బహుశా అయిదారు నెలలు ఉంటామేమో! మీ రేమైనా పుచ్చుకొంటారా?

శశాంకుఁడు.

దయచేసి మంచినీళ్లు తెప్పిస్తారా?

విద్యుల్లత.

ఇక్కడే ఉన్నాయి. (అని లేచి ప్రక్కగదిలోనికి వెడలును.)

చారుదత్తుఁడు.

మీరు అమెరికానుండి ఎప్పుడు వచ్చారు ఇండియాకి?

శశాంకుఁడు.

కొలంబోలో దిగడ మేమిటి ఇక్కడకు రావడ మేమిటి. డైవోర్సు ఇచ్చిన వెంటనే బయలుదేరాను.

చారుదత్తుఁడు.

తుషారకణ ఎక్కడున్నది ?

శశాంకుఁడు.

మేము విడాకు లిచ్చిన తర్వాత మళ్లీ చూడలేదు. బహుశా ఇంగ్లండు వెళ్లి అక్కడనుంచి హిందూదేశం విమానంమీద వచ్చి ఉండాలి.

చారుదత్తుఁడు.

మీ రిద్దరూ ఇల్లా విడిపోవడం చాలా దురదృష్టం.

శశాంకుఁడు

దురదృష్టంలా కనిపిస్తుంది కాని ఒకవిధంగా మహాదృష్టమే.

చారుదత్తుఁడు.

ఏం ?

## చతుర్థాంశము

శశాంకుఁడు.

సుఖంలేని వివాహబంధంనుండి తప్పించుకొనడం వంటి సుఖం మరి ఒకటి ఉందా ? నిజంగా మనుష్యునికి ముక్తి నిస్తాయి విడాకులు !

చారుదత్తుఁడు.

మీరు చెప్పింది నిజమే కావచ్చును. ఐనా వివాహ బంధం కష్టమైనప్పుడే కాదూ విడిచి పెట్టడం సుఖం ?

శశాంకుఁడు.

చూడండి ! నేను ఒకమాట చెపుతాను. ఎక్కడో తప్ప అసలు వివాహ మంటేనే సుఖం లే దన్న మాట.

చారుదత్తుఁడు.

అలాగ అనడానికి వీల్లేదు-వివాహం ఐహికాముష్మిక సుఖాలు ఇస్తుంది. దైవసంబంధ మైన దనికూడా తెలిసిన పెద్దలు చెపుతారు. ఏవో కొన్ని లోపాలు రాక మానవు. వాటిని మనం అంత గుర్తించకూడదు ఇంతకూ నే జెప్పే దేమి టంటే వివాహం చాలా పవిత్ర మైనది.

శశాంకుఁడు.

క్షమించాలి. నే చెప్పినట్లు ఎక్కడో నూటికి ఒకడు తప్ప మిగిలిన వివాహమైన వాళ్లందరూ వివాహం దుఃఖ భూయిష్ఠం అని చెప్పక మానరు....పెద్ద లేదో వివాహం

దైవసంబంధం అయింది అని అంటారు. కాని అది వట్టి అబద్ధం. ఈ పెద్ద లంత దొంగలు ఇం కొకళ్ళ శేరనుకోండి. వాళ్లకుకూడా తెలుసును తాము చెప్పేది అబద్ధం అని. వాళ్ల మాత్రం భార్యలచేత చెప్పుదెబ్బలు తినడంలేదూ ?....అది దైవసంబంధమా? ఇదంతా పైకి మాయచేయడమండీ ! కాక పోతే మనుష్యులయొక్క కామచేష్టలతో కామం లేని ఈశ్వ రునికి ఏమి సంబంధమండీ !

చారుదత్తుఁడు.

(నవ్వును.)

శశాంకుఁడు.

మీరు నవ్వడం కాదు. బాగా ఆలోచించి చూడండి స్వబుద్ధితో మనవాళ్ల తప్పు లనేవి ఎన్నో తప్పులు కానట్లు కనిపించక మానవు.

విద్యుల్లత.

(గ్లాసులోఁ బ్రవేశించును.) క్షమించాలి ఆలస్యమైనందుకు. (అని గ్లాసు నిచ్చి కూర్చుండును.)

శశాంకుఁడు.

(స్వీకరించి పానముచేసి గ్లాసు క్రింద నుంచును.)

చారుదత్తుఁడు.

మీరున్నూ తుషారకణా ఎందుచేత వేరు కావలసి వచ్చిందో మీ కభ్యంతరం లేకపోతే చెప్పమని అడగవచ్చా?

శశాంకుఁడు.

ఆఁ. దాని కేమి ఉంది!

చారుదత్తుఁడు.

నేను చనువుచేత అడిగేను. క్షమించాలి .. విద్యుల్లత కూడా మీకు కొత్తదికాదు గదా?

శశాంకుఁడు.

అబ్బే. కారణ మేమీ అంత గొప్పదిగా కనిపించ కపోవచ్చును—కాని బాగా చూస్తే కావలసినంత కారణం ఉంది. తుషారకణా నేనూ వివాహమైన తర్వాత కొన్నాళ్లు చాలా బాగానే ఉన్నాం. తరవాత కారణం చెప్పలేను, ఒకరి మీద ఒకరికి పెళ్లి కాకముందు ఉన్నంతప్రేమ తగ్గిపోయింది క్రమంగా. ఎల్లప్పుడూ కలిసి ఉండడంకూడా ఒకవిధమైన విసుగులోనికి వచ్చింది. నాకిష్టమైనది ఆమెకి నచ్చలేదు. ఆమె చెప్పినది నా కిష్టము కాలేదు. పైపెచ్చు నామీద అధి కారం చెలాయించాలని తుషారకణకు వాంఛ .చెలాయిం చిందికూడాను ఒకవిధంగా. చూడండి భార్యలతో వచ్చిన చిక్కే అది-పెళ్లిచేసుకున్నాంగాని స్వాతంత్ర్యం అమ్ముకో లేదే! సరే ఏలా అయితేనేం? కాలం గడిచి పోయింది. ఇంక ఆఖరుకు ఈ దాస్యబాధ పడలేకపోయాను. గృహా కల్లోలాలు ఎక్కువ అయిపోయాయి. మా ఇద్దరికీ చాలా విష

యాల్లో భేదాలు వచ్చాయి. చీటికీ మాటికీ పేచీలు-శాంతికి దూరమైనాము. తప్పంతా నాది అని ఆమె అంది. నాకు మట్టుకు అంతా ఆమెదిలాగే కనిపించింది. ఆఖరకు ఇద్దరం ఆలోచించుకుని విడాకులు ఇచ్చేసుకున్నాం. ఇదీ కథ!

చారుదత్తుఁడు.

(ఒకింత శిరఃకంపము చేయును.)

విద్యుల్లత.

(తనకోక యంచు చూచుకొనుచుండును.)

(ఎవరో తలుపు తట్టుదురు.)

చారుదత్తుఁడు.

ఎవరు?

సేవకుఁడు.

(తలుపు చాటునుండియే) ఇన్స్యూరెన్సు వాళ్లు వచ్చారయ్యా!

చారుదత్తుఁడు.

వస్తున్నా. (లేచును)

విద్యుల్లత.

(లేచును.)

శశాంకుఁడు.

(లేవఁబోవును.)

చారుదత్తుఁడు.

కూర్చోండి. మీ ఇద్దరూ మాట్లాడుతూ ఉండండి. నేను త్వరలోనే వస్తా.

శశాంకుఁడు.

(కూర్చుండును.)

విద్యుల్లత.

(సందేహించు చున్న దానివలెఁ గనఁబడును.)

చారుదత్తుఁడు.

విద్యుల్లతా ! శశాంకునితో మాట్లాడుతూ ఉండు. కొత్తవాడా ఏమిటి ?

(అని నిష్క్రమించును.)

విద్యుల్లత.

(కూర్చుండును.)

శశాంకుఁడు

మీనాన్నగారు ఖులాసాగా లేనట్లున్నారే !

విద్యుల్లత

కొంచెం సుస్తీగానే ఉన్నారు. వారుకూడా మీతో యూరపు వస్తూ ఉన్నారు. మీకు తెలిసి ఉండవచ్చును.

శశాంకుఁడు.

అవును....(ఆమె ముఖమువైపు చూచును)

విద్యుల్లత.

(తలవంచుకొనును. రెండునిమిషములు నిశ్శబ్దము.)

శశాంకుఁడు.

(ఎట్టకేలకు) మీరు నన్ను మరిచిపోలేదుగదా?

విద్యుల్లత.

(శశాంకుని గాంచి మరల శిరము వంచుకొనును)

శశాంకుఁడు.

మీరు ఎప్పటికీ నన్ను మరిచిపోరని నాధైర్యం.

విద్యుల్లత.

(మౌనము.)

శశాంకుఁడు.

నేను ఎన్నితప్పులు చేసినా క్షమిస్తారని నానమ్మకం!

విద్యుల్లత.

మీ తప్పేమి ఉంది?

శశాంకుఁడు.

తప్పా, తప్పున్నరా? నావంటి చలచిత్తుడు-ద్రోహి-అజ్ఞానుడు—ఇంకొక డుండడు!....క్షమించండి. ఉద్రేకం చేత గట్టిగా మాట్లాడుతున్నాను.

విద్యుల్లత.

(కంటినుండి నీరు విడుచును.)

శశాంకుడు.

మీరు నన్ను క్షమించండి. నా హృదయం దహించుకుని పోతూ ఉన్నది—మిమ్మల్ని నేను నిజంగా ప్రేమిస్తూన్నా. వివాహమైన మీఎదుట ఇలా అన్నందుకు క్షమించండి. మీ పవిత్రమైన ప్రేమకుడు నేను తగను. మిమ్మల్ని మోసపుచ్చాను. నన్ను మోసపుచ్చుకొన్నాను . (జేబులోంచి ఉంగరము తీసి) ఈ ఉంగరం జ్ఞాపకం ఉందా ?

విద్యుల్లత.

(చూచి తలవంచుకొనును)

శశాంకుడు.

ఈఉంగరం ఆనాడు రాత్రి నృత్యంలో మీరు నన్ను ఉంచమన్నారు. మీరు మీఅత్తగారు పంపించారని చెప్పారు. మళ్లీ మీరు అడగాలేదు—ఇవ్వా లేదు. దీనిమీద నేనునేను పూజించే స్త్రీ పవిత్రనామం ఉంది నాకు కవరులో పంపించడం ఇష్టం లేకపోయింది. స్వయంగా ఇవ్వాలని వచ్చాను. మీమనసులో ఈఉంగరం నాదగ్గిర మీపేరులో ఉంటే మీకేమి కష్టంగా ఉంటుందో అని తీసుకొచ్చాను. పారవేయడానికి చేతులు రాలేదు. ఈ పవిత్రమైన ఉంగరము నావంటి అపవిత్రునిదగ్గర ఉండకూడదు.

విద్యుల్లత.

(శశాంకుని జూచి తలవంచి)—మీరు చేసింది తప్పై

నప్పుడు నేను చేసిందీ తప్పే....నే నింక నాహృదయాన్ని దాచుకోలేను. నిజం చెప్పేస్తా. నేను మిమ్మల్ని దైవ సాక్షిగా ప్రేమించాను. అదే నా మొదటిప్రేమ. ఆప్రేమకు అంతం లేదు...నేను వివాహము నాధర్మాన్నిబట్టి చేసు కొన్నాను-పుత్రికాధర్మాన్నిబట్టి! చారుదత్తుడు, నాభర్త నన్ను అపారంగా ప్రేమిస్తూన్నాడు. అటువంటి అతని ప్రేమను ఆదరిస్తూన్నాను. గౌరవిస్తూన్నాను. నాభర్తకు అవిశ్వాసంగా ఉండనే కూడదు. ఏమైనాసరే మిమ్మల్ని ఇంక ప్రేమించ కుండా ఉండాలని ఎంత ప్రయత్నం చేసినా నాప్రయత్న మంతా విఫలమైంది. మీయందు ఉన్న నాఅగాధమైన ప్రేమ నుండి నన్ను వేరు చేయలేకపోయినాను. నాప్రేమా నేనూ ఒకటే. నాప్రేమను నేను నాలోనే జాగ్రత్తగా ఇతరులకు తెలియకుండా దాచుకొన్నాను. మీతోకూడా నాస్థితి చెప్ప దలచుకోలేదు. కాని ఈవేళ ఇప్పుడు చెప్పకుండా ఉండలేక పోయాను. ఇల్లా నాదుర్బలత్వం వెల్లడి అయింది.

శశాంకుడు

(నివ్వెఱపోయి చూచును.)

విద్యుల్లత.

(అతనిని జూచి) నాహృదయాన్ని సిగ్గు విడిచి ఈ విధంగా వెల్లడిచేశాను. దీన్నిబట్టే నాప్రేమ ఎంత పవిత్ర

మైనదో ఎంత భయంకరమైనదో మీకే తెలుస్తుంది. ఉత్కృష్టమైన ప్రేమకు సిగ్గు తెలియదు. అవసరం లేదు కూడాను. మిమ్మల్ని నేను ప్రేమిస్తూన్నా—ప్రేమిస్తూన్నా—దైవసాక్షిగా ప్రేమిస్తూన్నాను—మీరు నన్ను ప్రేమించినా ప్రేమించకపోయినా నేను మట్టుకు మిమ్మల్ని ప్రేమిస్తా. మిమ్మల్ని నేను చూడక పోయినా, ఎంత దూరమందున్నా, ఏలోకమందున్నా ప్రేమించకుండా ఉండలేను. నాకు ఇప్పుడు యుక్తాయుక్తములు తెలియడం లేదు. (లేచి) భావోద్రేకం ఎక్కువగా ఉంది. ఇంక ఇక్కడ ఉండలేను. వెడతా—క్షమించండి. (అని వెడలబోవును.)

శశాంకుడు.

(లేచి) మీరు వెళ్లవద్దు. మీరు వెడితే నాకి ప్రపంచమంతా అంధకారమై పోతుంది. మిమ్మల్ని దూరాన్నుంచి అయినా చూచి సంతోషిస్తా.

విద్యుల్లత.

క్షమించాలి—మీరు నన్ను చూచినకొలదీ నామనస్సు నా స్వాధీనంలోనుంచి తప్పించుకొనిపోతూంది. నా అనురాగం నన్ను ఈడ్చివేస్తూంది.

శశాంకుడు.

మీరు నన్ను ఇంత ప్రేమిస్తూన్నప్పుడు ఈప్రేమని యీలా దాచడం ఎందుకు?. .ప్రపంచానికి భయపడకండి!

ఈ ప్రపంచంలో ఉన్న ప్రజలంతా మాయవాళ్లు. దుర్మార్గులు. శఠులు. కుచ్చితాభిప్రాయాలు కలవాళ్లు. ఈలాంటి వీళ్ల ఏ మనుకుంటే ఏమి ?

విద్యుల్లత.

నేను మిమ్మల్ని ప్రేమిస్తూన్నట్లు వెల్లడిచేయడం వల్ల లాభం లేదు. ఇంకా పైపెచ్చు కొందర్ని కష్టపెట్టవలసి వస్తుందికూడాను. అది కాకుండా గృహిణీధర్మానికి విరుద్ధం. నా సుఖాన్ని లెక్కచెయ్యను' ధర్మం నెరవేరుస్తా. నే కష్టపడుతూన్నా ఒకళ్లని సంతోషపెడితే భగవంతుడు దయదలుస్తాడు–సుఖంకోసం అన్ని జంతువులు ప్రయత్నిస్తాయి. మనుష్యులుకూడా ఆలాగే చేయడంలో గొప్ప ఏమి ఉంది ? స్వార్థత్యాగమే మానవధర్మం.

(చారుదత్తుడు ప్రవేశించును)

చారుదత్తుడు.

ఔను ! స్వార్థత్యాగమే మానవధర్మం !

శశాంకుడు. }
విద్యుల్లత. }

(నివ్వెఱపడి చూచెదరు)

చారుదత్తుడు.

మీరు ఏమీ ఆశ్చర్యపడి చూడవద్దు మీమాటలు

చాలమట్టుకు విన్నాను. తలుపు వేయడం మరిచిపోయారు. నేను బయట నిలుచుని ఇన్స్యూరెన్సు వానితో మాట్లాడుతున్నాను. అప్రయత్నంగా మీమాటలు విన్నాను. వినాలని తలంపుతో విన్నా నని అనుకోవద్దు. నాస్వభావం అలాంటిది కాదు. నాతో మాట్లాడిన యిన్స్యూరెన్సు వానికి మనభాష రాదు. అందుచేత మీమాటలు వానికి అర్థమై ఉండవు. వాడు వెళ్లిపోయాక నేను లోపలికి రావా లనుకొన్నాను. కాని మీఇద్దరి మాటలకీ అడ్డు రాదలచుకోలేదు. బయటనే ఉన్నాను. అన్నీ విన్నాను. వినకుండా ఉండ లేకపోయినందుకు క్షమించండి. మీరు ఏమీ కంగారు పడవద్దు. నాకు మీమీద ఏమీ కోపం లేదు అయినా కోపం ఎందుకు? విద్యుల్లతా! నీవంటిస్త్రీ లోకంలో ఉండదు. నీవు మహాపతివ్రతవు—స్త్రీలోకానికే కాకుండా మానవలోకాని కంతకూ కూడా ఆదర్శకురాల వయ్యావు. మహాపూజ్యురాలవు. నీస్వార్థత్యాగం ఆశ్చర్యకరం. నీవు ధర్మమందున్న ఆసక్తికి ఈ ప్రపంచంలో ఉన్న అన్నివస్తువులూ కలిసి ఒక్కసారి జయజయధ్వని చేసి యభినందింపవలసియున్నది. నీమాటలు విని స్తబ్ధుడనై పోయాను. నే విన్నసంగతి మీకు తెలియనీయకపోవడం ధర్మంగా నాకు కనిపించలేదు. అందుచేత మీఎదుటకు వచ్చాను. నేను విన్నట్టు తెలియనీయకపోతే

నీవు కష్టపడి ఉండవు. నీవంటిస్త్రీకి ఇలాంటికష్టం కలుగజేసి నందుకు చింతిస్తున్నాను. ఈ మాటలు నేను ఎంతమాత్ర మూ కోపంతో అన్నవికావు. నిజంగా మనస్ఫూర్తిగా అన్నాను.

విద్యుల్లత.

(భర్త పాదములకు నమస్కరించును.)

చారుదత్తుఁడు.

(లేవఁదీసి) నీవు నమస్కరించకూడదు. నేనే నీధైర్యానికీ నీస్వార్థత్యాగానికీ నమస్కరించాలి. విద్యుల్లతా! ఇన్నాళ్లు ప్రేమించిన వానిని విడిచి ఇంకొకనితో ధర్మం కోసం ఏలా కాపరం చేసేవో అత్యద్భుతం! అయినా నన్ను ఎంతో శ్రద్ధతోను, భక్తితోను, ఇష్టంతోను చూశావు!

విద్యుల్లత.

నన్ను క్షమించాలి.

చారుదత్తుఁడు.

క్షమించుట ఎందుకు? తప్పు చేస్తే క్షమార్పణ. నీ తప్పేమి ఉంది? నీ కింత కష్టం ఇచ్చింది నేను. తెలియకుండా నీ కీ కష్టంకలిగించాను-నీకిష్టమైనవాణ్ణి చేసుకోలేదు. పైపెచ్చు ఇంకొకనితో నీవు కాపరం చేసేలాగు చేశాను. ఇంతకన్న ఇంకో కష్టం ఉందా? నీవు-పాపం! ఎంత కష్ట

పద్మావో ః విద్యుల్లతా ః క్షమించు. నీ జన్మ దుఃఖమయంగా చేసినందుకు క్షమించు ః

విద్యుల్లత.

(కంటి నీటితో) కష్టం కలిగించినది నేను. నన్ను క్ష మించండి.

శశాంకుఁడు.

ఈకష్టాని కంతా నేనే కారణం. . గతించిం దంతా మళ్లీ రవులు కొల్పేసు. ఆరిపోయిన మంటని మళ్లీ డూదేసు. మీ ఇద్దరూ నన్ను క్షమించండి. నే వెడ తా. (వెళ్లఁబోవును )

చారుదత్తుఁడు.

(ఆఁపి) వెళ్లవద్దు. వెళ్లేది నేను.

విద్యుల్లత. }
శశాంకుఁడు. }
(ఆశ్చర్యముతోఁ జూచెదరు )

చారుదత్తుఁడు.

స్వార్థత్యాగం అనే మహామంత్రం విద్యుల్లత నాకు ఈవేళ ఉపదేశించింది. దానిని నేను సార్థకపరచాలి. విద్యు ల్లతా ః అయిపోయిన దేదో అయిపోయినది. ఇకనైనా సు ఖంగా ఉంటే నా ఆత్మకు శాంతిగా ఉంటుంది. నీవు శశాం కుణ్ణి మనసార ప్రేమిస్తూన్నావు. నీకు నేను విడాకు లిచ్చే

ప్రాను. శశాంకుడు నిన్ను ప్రేమిస్తున్నాడు. అతన్ని వివాహం చేసుకొని సుఖంగా ఉండు. నీవు ఎక్కడున్నా సుఖంగా ఉంటే నా కదే చాలు! నీ ఆనందమే నా ఆనందం. నీవు నన్ను ప్రేమించకపోయి నప్పటికీ నేను నిన్ను ప్రేమించడంలోనే ప్రేమ ప్రకాశిస్తుంది. నీవు నన్ను ఒకప్పుడు ప్రేమించినావని అనుకొన్నాను అదే చాలు. ఆ అనుకోవడంలోనే నా జన్మఫలించినది. నేను భ్రమపడ్డాను. కాని స్త్రీమే పూజ్యమైనది. శరీరసౌఖ్యం అంత ముఖ్యమైనది కాదు! ఉండవలసినది ప్రేమ! అది ఉన్నప్పుడు మిగిలిన శరీరసౌఖ్యాదు లున్నా లేకపోయినా అక్టే ఫరవాలేదు. ఏలా అయినా నిన్ను నే ప్రేమించుచున్నా నను కోవడంలోనే నా మహానందం. శశాంకా! విద్యుల్లతా! మీరు నామాట విని వివాహం చేసుకొండి—ఇంక నామాటా! నన్ను ప్రేమించే వాళ్లు ఈప్రపంచంలో నాకు లేరు. నే నెలాపోయినా విచారించే వాళ్లుండరు. నా ఆస్తి అంతా విద్యుల్లతకి ఇచ్చివేస్తున్నా. మీరిద్దరూ ఈవేళ వివాహం చేసుకొని రాత్రి రైల్లో బొంబాయి వెళ్లి యూరపు వెళ్లండి. ఇక్కడ ఉంటే ఈమార్పుల కొత్తచేత ఆ దొక విధంగా ఉండవచ్చు. నేను ఈరాత్రి డార్జిలింగుకి వెళ్లిపోతాను. ఎవ్వరూ దిక్కులేని వాళ్లకు భగవంతుడే కదా దిక్కు! సెలవు (వెడలఁబోవును.)

విద్యుల్లత.

(ఏడ్చుచు) మీరు వెళ్లవద్దు. మీరు వెళ్లవద్దు. మనం ఎప్పటి మోస్తరుగానే భార్యాభర్తలుగా ఉందాం. (అని అతని హస్తము పట్టుకొనును.)

చారుదత్తుఁడు.

నీకు మన పూర్వసహవాసంవల్ల ఇప్పుడు కష్టంగా ఉన్నా తరువాత నీవు సుఖిస్తావు. నావల్ల నీకు సుఖం ఉండదు. నాకు మట్టుకు నిన్ను విడిచి వెళ్లడం ఎంతకష్టం అయినా నీకోసం, నీసుఖం కోసం, వెళ్లుతున్నాను.

విద్యుల్లత.

(ఏడ్చుచు) వద్దు ! వద్దు ! (అని నేలపైఁబడును.)

శశాంకుఁడు.

(వెంటనే లేవనెత్తును.)

శశాంకుఁడు.
చారుదత్తుఁడు.

(ఇద్దఱును గూడి యామెను మంచముపైఁ బరుండఁబెట్టి విసరుదురు.)

చారుదత్తుఁడు.

(శశాంకునితో) మీరు వెళ్లి డాక్టరుని రమ్మని టెలిఫోను ఇవ్వండి.

శశాంకుఁడు.

(పడలును.)

చారుదత్తుఁడు.

(లోపలికి పోయి నీరు దెచ్చి యామె ముఖమును తుడుమును.)

వినయభూషణుఁడు.

(తొందరగాఁ బ్రవేశించి) అమ్మా! అమ్మా! ఏం? ఏం? (కుమార్తెను జూచి) అయ్యో! అయ్యో! అమ్మా! (అని మంచముపైఁబడి కుమారికపైఁ జేయి వైచి యేడ్చును.)

చారుదత్తుఁడు.

ఏమీ ఫరవా ఉండదు. దెబ్బ తగిలినట్లు లేదు. ముఖం తిరిగి ఉండాలి. తమరు కంగారు పడవద్దు.

వినయభూషణుఁడు.

కంగారా? నాయనా! కంగారా? కంగారు లేకుండా ఏలా ఉండను? నా కిది ఒక్కతే బిడ్డ. లేక లేక కన్నాను. . చిన్నప్పటినుండీ నేనే పెంచేను. నాకు ఈమె కన్న ఇం కెవరున్నారు? అయ్యో! అయ్యో! అమ్మా (అని యామెను గౌఁగిలించుకొనును.)

చారుదత్తుఁడు.

తమరు ధైర్యం తెచ్చుకోవాలి! ఫరవా లేదు.

వినయభూషణుఁడు.

ధైర్యం ఎల్లా వస్తుంది! గర్భశోకం! గర్భశోకం!. కడుపు తరుక్కొని పోతూంది--అయ్యో! దైవమా! నా ప్రాణమైనా తీసుకొని ఈమెను రక్షించవోయి భగవంతుడా!

(తుషారకణ ప్రవేశించి నివ్వెఱపోవును.)

చారుదత్తుఁడు.

(కంగారుపడవల దని సైఁగ చేయును. వినయభూషణునితో) తమరు ఊరడిల్లకపోతే విద్యుల్లతకు విశ్రాంతి ఉండదు.

తుషారకణ.

(మంచము చేరుచు. చారుదత్తుఁడామెకు విద్యుల్లత మూర్ఛపోయిన దని నెమ్మదిగాఁ జెప్పును. తుషారకణ మంచముపై కూర్చుండి విద్యుల్లత చేతులు నెచ్చఁజేయును )

చారుదత్తుఁడు.

(వినయభూషణు నుద్దేశించి) తమరు పెద్దలు. మావంటివాళ్లు అజ్ఞానపుపనులు చేస్తే చెప్పాలి కాని——

వినయభూషణుఁడు.

అవును నాయనా! ఇది అజ్ఞానమే. ప్రేమచేతఁ యుక్తాయుక్తములు తెలియవు.

విద్యుల్లత.

(కదలి కన్నులు విప్పి మరల మూయును.)

# స్వార్థత్యాగము

శశాంకుఁడు

(ప్రవేశించి తుషారకణను గాంచి కొంచె మ్లానితుఁ డగును.)

తుషారకణ.

(శశాంకుని జూచియు నేమియుఁ జలనము లేకయే విద్యుల్లత ఫాలభాగము నిమురుచుండును.)

చారుచిత్రుఁడు.

(విద్యుల్లతనే చూచుచుండును.)

వినయభూషణుఁడు.

(ప్రార్థన చేయుచుండును.)

విద్యుల్లత.

నేను—నేను ఎవరూ? ఎక్కడున్నాను? పగలా? రాత్రా?—ఈ గది తిరుగుతూంది—పట్టుకొండి—పడిపోతాను—నేను తల్లకిం దౌతూన్నాను—సూర్యుడూ—చంద్రుడూ—ఏడుస్తూనా[redacted]దరగోళంగా ఉంది—అంతా—

[redacted]డును.)

సమాప్తము.

---

